# సృజన

ఆధునిక సాహిత్య వేదిక



పేజీలు 1 రూ.

# సృజన

ఆధునిక సాహిత్య వేదిక

1973 డిసెంబర్ మాస పత్రిక 51



SRJANA is commended for use in Public Libraries in the State by the Director of Public Libraries, Andhra Pradesh Hyderabad, Vide Ref. No. 182/A4/67, dated 22-9-1967.

Edited and Published by P. Hemalatha for 'Sahithee Mithrulu'.
Printed at Venkataramana Mudranalayam,
J. P. N. Road, Warangal-506002 (A. P.)

# విప్లవం ప్రజల జన్మహక్కు

పౌర హక్కులంటే బూర్జువా ప్రజాస్వామ్య రాజ్యాంగం దులిపే ఎంగిలి మెతుకులుకావు. దోపిడీవ్యవస్థ పునాదులకు ప్రమాదంలేకుండావుండే మేరకు యివ్వబడే భావప్రకటనా స్వాతంత్ర్యంకాదు. కూడూ గూడూ గుడ్డ మాత్రమేకాదు ఆలోచన మానవుని ప్రాథమిక హక్కు. యీ ఆలోచన సంఘర్షణలో నిప్పుపుట్టిన సత్యాన్ని కనుగొన్న ఆదిమ సమాజ నాగరికతనుంచి వర్గ సంఘర్షణలో చరిత్ర నిర్మాణమైందన్న గతితార్కిక భౌతిక సత్యందాకా పయనించింది. బానిస సమాజంనుంచి బానిస భావన కూడాలేని కమ్యూనిజందాకా చరిత్ర ప్రాతిపదికగా వూహించింది. ఆచరణలో పుట్టిన ఆలోచన మార్పుకుమూలం. ప్రతి శాస్త్రీయమైన ఆలోచన చారిత్రికమైన మార్పుకు దారితీస్తుంది. మంచికోసంజరిగే మార్పు గుణాత్మకమైన ఫలితాన్నిస్తుంది. మంచి ఎప్పుడూ కష్టజీవుల క్షేమాన్నికోరే మంచే. వర్గసమాజంలో యీ మంచి మామూలుగా సాధించబడదు. రక్తపాతంతో, ప్రతిఘటనతో, పోరాటాలతోకూడిన మార్గంమాత్రమే దీన్ని సుగమం చేస్తుంది. వ్యవస్థలో సమూలమైన మార్పు అనేకానేక పీడితుల మంచికోసం శ్రామికవర్గ నాయకత్వం సాధించే మార్పు విప్లవం. విప్లవంలో శ్రామికులేకాదు ఆ నాయకత్వం అండనిలిచిన ప్రతివాడి జీవితం గుణాత్మకమైన మార్పుకు లోనవుతుంది. మనిషి మార్పును కోరుకుంటాడు. మంచికొరకు మార్పును కోరుకుంటాడు. విప్లవాన్ని కోరుకుంటాడు. అందుకే "ప్రజలు విప్లవాన్ని కోరుతున్నారు" అన్నది యివాల్టి యుగసత్యం. విప్లవం మన జన్మహక్కు. యీ జన్మహక్కును సాధించుకోవటమే పౌరహక్కుల లక్ష్యంకావాలి. యీ విప్లవాలను విజయవంతంచేసే బాటలోనే పౌరహక్కుల సంఘాలు పనిచేయాలి. దోపిడీ తుపాకిని పడగొట్టడానికి ప్రజల తుపాకీ, దోపిడీ రాజ్యాంగాన్ని తుదముట్టించడానికి ప్రజాకోర్టులు వెలుస్తున్న విప్లవ కాలంలో శ్రీకాకుళాలను ఆవిష్కరించడమే పౌరహక్కుల సంఘాల లక్ష్యంకావాలి. మనకొరకు ఆయుధంపట్టిన గెరిల్లాచేతులకు సాయుధ సంఘీభావ హస్తాలనందించడమే మన కర్తవ్యంకావాలి. సాయుధమార్గాన్ని నిర్వచించి నిర్దేశించి నిలబెట్టుకోవడమే మన ప్రచారంకావాలి. సాయుధ పోరాటమే ఏకైక మార్గం- అని చాటిచెప్పడమే మన నినాదంకావాలి. పౌరహక్కులను ప్రభుత్వ చట్టాలద్వారానో, న్యాయస్థానాలద్వారానో సాధించుకుంటామనే భ్రమలకు కాకుండా సాయుధ పోరాటాలద్వారా సాధించుకోగలమనే చేవను చైతన్యాన్ని విశ్వాసాన్ని ప్రజల్లో రంగరించిపోసే ప్రజావిముక్తి పోరాట ప్రచారవేదికలు కావాలె పౌరహక్కుల సంఘాలు. ఇట్లా కావాలంటే మొదలేచెప్పినట్లు మన హక్కులేమిటో తెలుసుకోవాలె. ప్రపంచవ్యాప్తంగా ప్రజల జన్మహక్కు విప్లవం. ఆ హక్కును సాధించుకునే మార్గంకూడా విప్లవమే.

## పబ్లిషర్స్ నోట్

సృజన ఏడు సంవత్సరాలుగా క్రమం తప్పకుండావెలువడుతున్నా, మూడు సంవత్సరాలుగా మాసపత్రికగా వస్తున్నా, ఒక న్యూస్‌పేపర్‌గా రిజిస్ట్రార్ ఆఫ్ న్యూస్‌పేపర్స్ ఆఫ్ ఇండియా, పోస్టల్ డిపార్ట్‌మెంట్, డైరెక్టర్ ఆఫ్ పబ్లిక్ లైబ్రరీస్ ఏనాడో గుర్తించినా యీనాటికీ న్యూస్‌ప్రింట్‌కోటా యివ్వలేదు ప్రభుత్వం; చిన్న పత్రికలకు ప్రోత్సాహం నినాదాలిచ్చే ఇందిరా గుజ్రాల్ ప్రభుత్వం. కోటా మాట అలావుంచి మార్కెట్‌లోకూడ న్యూస్‌ప్రింట్ కరువు దినదినమూ అధికమవుతున్నది. వ్యవసాయానికి ఎరువులు, రచనా వ్యవసాయానికి కాగితం కటకట.

73 జులైలో 32, 33 రూపాయలున్న 1 రీము (డెమీసైజ్) న్యూస్‌ప్రింట్‌కు– ఆగస్ట్ 33, సెప్టెంబర్ 40, అక్టోబర్ 45, నవంబర్ 53 రూపాయలుగా పెరిగింది.

ఇక తప్పనిసరియై ఇతర పత్రికలవలె రేటు పెంచడంకాకుండా పేజీలు తగ్గించాలని నిర్ణయించాం ఆగస్టులోనే న్యూస్‌ప్రింట్ కొరతగురించి ఫ్రాంటియర్ పత్రిక ఇలారాసింది "...ఎంత తక్కువ చదివితే అంతమంచిదనేమో. దిగుమతి కుంభకోణంలో ఒక కుట్ర వుండివుంటుంది: ఈ దేశంలో చాలమంది ప్రజలు చదువలేరుగనుక టెలివిజన్ ఏర్పాటుచేసుకోవడం మంచిది!"

పెట్టుబడిదారీ సమాజంచేసే కుట్రలు మార్క్సిస్టు– లెనినిస్ట్ అవగాహనతో పసిగడితేతప్ప ఒకమానాన అర్థంకావు. డచ్ విప్లవ రచయిత ముల్తతులి రచనలు హక్కులతోపాటు కొని ప్రచురణకర్తలు వాటన్నిటినీ కాల్చేసారు. ఆ రకంగా ప్రజాశక్తులను క్రూరమైన కుట్రచాటున దెబ్బతీసే ప్రయత్నంచేసారు. న్యూస్‌ప్రింట్ కొరతవల్ల నిజంగా నష్టపడేది ప్రజలే. వ్యాపార పత్రికలన్నీ వ్యాపార ప్రకటనలు ఎప్పటివలెనే వేసి వార్తలనుమాత్రమే తగ్గిస్తున్నారు. న్యూస్‌ప్రింట్ కరువుపేర రేట్లు పెంచుతున్నారు. పండుగలకు ప్రత్యేక సంచికవేయడం ఒక వ్యాపారపండుగ. నిండా వ్యాపార ప్రకటనలేవేయొచ్చు. ఎటొచ్చీ విప్లవప్రచారానికి ఉద్దేశించిన ప్రజలపత్రికలకే ఇబ్బంది. ప్రజల కొనుగోలుశక్తిని దృష్టిలోపెట్టుకొని వెలపెంచడానికి మనస్కరించదు. పత్రిక వెల ప్రారంభమయినచోట నిలవాలి. కాగితంవెల చుక్కలదాక ఎగిరిపోయింది. ఈ రెంటి మధ్య వంతెన– పేజీలు తగ్గించడంతప్ప గత్యంతరంలేదు. అయినా కొన్ని ప్రత్యేక సంచికలు తప్పవు. సృజనకు రెండు పుట్టినరోజులు. నవంబర్‌కాక ఫిబ్రవరి మాసపత్రికగా సృజన పుట్టినరోజు. మేడే కార్మికుల ప్రపంచ పండుగ. అక్టోబర్ విప్లవం, విరసం సభలు– ఇవన్నీ ఎక్కువ పేజీలతో సృజన వస్తూనేవున్నది. న్యూస్‌ప్రింట్ రేట్లు విపరీతంగా పెరిగినయీ 5 నెలల కాలంలోకూడ సృజన చాల ఎక్కువ పేజీలతో వెలువడింది. నిజానికి 64 పేజీలకన్నా ఎక్కువ పేజీలువేస్తే అన్నికాపీలు అమ్మినా పెట్టిన డబ్బు రాదు, పైగా కొంతకాలంగా తప్పనిసరిగా కవర్‌చిత్రాలు వేస్తున్నాం. ఇవన్నీ గణనలోకి తీసుకొని ఇకనుంచి సృజన 64 పేజీలతోనే వెలువడాల్సిన అత్యవసర పరిస్థితిని పాఠకులు సానుభూతితో అర్థంచేసుకుంటారని ఆశిస్తాం.

# పంచాది నిర్మల

"మాంచాలను కొలుస్తారు, మల్లమ్మను తలుస్తారు,
ఝాన్సీ లక్ష్మీబాయికి బాష్పధార విడుస్తారు,
సరోజినీదేవి ఫొటో పటంకట్టి పొగుడుతారు,
పంచాది నిర్మలంటే భయంపుట్టి వణుకుతారు!"

(శ్రీ శ్రీ)

— పంచాది నిర్మలంటే భయంపుట్టి వణికేవాళ్ళు ప్రజా శత్రువులు మాత్రమే. ప్రతి స్త్రీ "ఒక నిర్మల కావాలి" "ప్రతి స్త్రీ ఒక గెరిల్లా కావాలి" అన్నవి యీనాడు ప్రజావిముక్తి పోరాటాల్లో ప్రతిధ్వనిస్తున్న నినాదాలు.

పంచాది నిర్మల వీర తెలంగాణా పోరాటంలో పోరాడుతూ అసువులు బాసిన గెరిల్లాలకు వారసురాలు. రాబోయే పోరాట తరానికి ఒరవడి. మార్క్సిస్ట్ - లెనినిస్ట్ పార్టీ స్థాపకుల్లో ఒకడు, పార్టీ కేంద్ర కార్యవర్గ సభ్యుడు, శ్రీకాకుళానికి ప్రియతమ నాయకుడు పంచాది కృష్ణమూర్తి అర్ధాంగి నిర్మల. మార్క్సిస్టు-లెనినిస్ట్ పార్టీ స్థాపించిన ఏడాదికే 69 మే నెలలో కృష్ణమూర్తి శత్రువుల చేతుల్లోపడి కాల్చివేయబడ్డాడు. ఆయన వీరమరణం తర్వాత చాలామంది నిర్మలను యింటివద్దనేవుండి తన యిద్దరి పిల్లల భవిష్యత్తుగురించి ఆలోచించమన్నారు. పోలీసులుకూడా ఆమె తమకు లొంగి పోరాటాన్ని విరమించుకుంటే ఆమెపైవున్న వారంట్ వుపసంహరించుకుంటామని ఆశచూపారు. ఏజెంట్లద్వారా వార్తలుపంపారు. ఆమె చాలా అరుదైనస్త్రీ. అన్ని తీర్ల ఆశలనూ, ఒత్తిళ్ళనూ వీరోచితంగా ఎదిరించి నిల్చింది. పోలీసుల సలహాను అసహ్యంతో తృణీకరించింది. మనస్సును, ఆత్మను విప్లవపోరాటానికి అర్పించింది. త్వరలోనే జిల్లా అంతా ఆమె పేరు వర్గశత్రువు గుండెల్లో వొణుకు పుట్టించింది. యిది బహుశా ప్రపంచ చరిత్రలోనే చాలా అరుదైన విషయం. విప్లవ చరిత్రలోకూడా అరుదైన విషయం. తన భర్త వీరమరణంచెంది పడిపోతున్న తరుణంలోనే ఎందరితో పాటో తానుకూడా పోరాటంలో దూకి వీరోచితంగా పోరాడి వీరమరణాన్ని పొందడం కథకాదు. వాస్తవంగా జరిగిన పోరాటసత్యం. యీ దేశంలో విప్లవం యిప్పటికే యిటువంటి వీరదంపతులను సృష్టించిందని తెలుసుకున్నప్పుడూ తలుచుకున్నప్పుడూ గుండెలు ఆశతో గర్వంతో నిండిపోతాయి.

# మృతవీరుల సంస్మరణ

"ఎక్కడ పోరాటం వుందో అక్కడ త్యాగం వుంది. మరణమనేది సామాన్య మైన ఘటన. కాని మన ముందు ప్రజల అవసరాలు బాధలు పర్చుకుని వున్నాయి. మన హృదయాల్లో యివి స్పందిస్తున్నవి. మనం ప్రజల కొరకు చనిపోయినపుడు మన చావు సార్థకమవుతుంది"— అన్నాడు ఛైర్మన్ మావో.

"హృదయవిదారకమైన త్యాగం సాహసికమైన నిర్ణయాన్ని పటిష్టం చేస్తుంది. కొత్త ఆకాశంలో సూర్యున్ని చంద్రున్ని ప్రకాశింప చేయడానికి సాహసిస్తుంది"— '69 నవంబర్ ఆఖరి రోజుల్లో డిసంబర్ ఆరంభంలో శ్రీకాకుళ రైతాంగ సాయుధ పోరాటంలో పదముగ్గురు కామ్రేడ్స్ అమరులయ్యారు వారిలో ముగ్గురు స్త్రీలు— శ్రీకాకుళ రైతాంగ పోరాట విప్లవకారులు తమ నెత్తురుతో అపూర్వమైన చరిత్రను రచించారు. అది భారత విముక్తి చరిత్ర.

నవంబర్ 22 రోజు కామ్రేడ్ చాగంటి భాస్కర్‌రావు, తామాడ గణపతి, గోరకల సన్యాసి, కంచెరాపు కృష్ణమూర్తి ఆకస్మిక ఎన్‌కౌంటర్‌లో ఎంతో పెద్దసంఖ్యలోవున్న పోలీసులకు దొరికారు. వీళ్ళు చివరి క్షణందాకా కూడా పోరాడుతూనే వున్నారు. చాలా మైళ్ళదూరం తీసికెళ్ళబడి కాల్చివేయబడ్డారు. యీ సాహసికులైన కామ్రేడ్స్ పార్టీపట్ల ప్రజలపట్ల విప్లవంపట్ల అసువులుబాసేదాకా నిజాయితితో వ్యవహరించారు.

సరిగ్గా ఒక నెలరోజుల తరువాత డిసెంబర్ 22న మరొక ఆరుగురు కామ్రేడ్స్ సుబ్బారావు పాణిగ్రాహి, పంచాది నిర్మల, రమేష్‌చంద్ర సాహు, అంకమ్మ, సరస్వతి, ఉమారావు ఒరిస్సా సరిహద్దుల్లోవున్న తమ ఆశ్రియంలో పోలీసు మూకలతో చుట్టు ముట్టబడ్డారు. అప్పుడు కామ్రేడ్ సుబ్బారావు పాణిగ్రాహి జబ్బుపడి బాధపడుతున్నాడు. యితర కామ్రేడ్స్ ఒక గ్రినేడ్ ఆకస్మికంగా పేలడం వల్ల గాయపడివున్నారు. వీళ్ళను పట్టుకున్న పోలీసులు మార్క్సిస్టు–లెనినిస్టుపార్టీకి రాజీనామాయిచ్చి సాయుధ పోరాటాన్ని నిరాకరిస్తే వొదిలిపెడతామని ఆశపెట్టారు లేకుంటే కాల్చేస్తామన్నారు. జీవితం చాలా విలువైంది కాని మన కామ్రేడ్స్‌కు అంతకన్నా విలువైనది పార్టీ, విప్లవం, యీ దేశ 50 కోట్ల ప్రజల భవిష్యత్తు. అందుకే శత్రువు యివ్వజూపిన ఆశను తిప్పికొట్టారు. శత్రువు పార్టీనిగాని, విప్లవ పోరాటాన్నిగాని కించపరచేమాట మాట్లాడ డానికికూడా అవకాశమివ్వలేదు. మచ్చలేని తమ విప్లవ జీవితాలకు మసిపూసే అవకాశం యివ్వలేదు. తలలు వున్నతంగా పైకెత్తి గుండెలనిండా పార్టీఎడ గర్వంతో

విప్లవ అంతిమ విజయంపట్ల జ్వలిస్తోన్న విశ్వాసంతో వారిట్లా అన్నారు—" మీ దయా దాక్షిణ్యాలను మేం బిచ్చమెత్తడంలేదు. మా పోరాట లక్ష్యాన్ని చంపేయడానికి మీరు చాలా బలహీనులు. అధికారహీనులు. మేం అంటే ప్రజలం మిమ్ములను ఖతంచేస్తాం. ఎందుకంటే మీకు మీపైన ఆదర్శాలులేవు. అసలు మీరు బతికివున్నారా? అని, మీరు చావు సమీపించిన అభివృద్ధి నిరోధకులచేతుల్లో నిద్రిజోగుతున్న సోమరిపనిముట్లు.

మా పార్టీ యీదేశ స్వరూపాన్ని ప్రపంచ స్వరూపాన్నే మార్చేసే విప్లవానికి నాయకత్వంవహిస్తున్నది. తరతరాలుగా మా ప్రజలు భూస్వాములచేతుల్లో, సామ్రాజ్య వాదుల చేతుల్లో, వాళ్ళ ఏజెంట్లచేతుల్లో దోపిడీకి తన్నులకు చిత్రిహింసలకు గురి అయ్యారు. ఇప్పుడు ప్రిజలు మేల్కొన్నారు. తమ వీపులమీదకూర్చొని తమను అణ చేసిన వీళ్ళను తమ కాళ్ళకింద రాచేయడానికి. చాలా దీర్ఘకాలమైన చీకటిరాత్రి పరి సమాప్తం కాబోతున్నది. తెల్లవారబోతున్నది ప్రిజల అధికారంఅనే కాంతివంతమైన ఎర్రిటి సూర్యుడు వుదయిస్తున్నాడు. మరణిస్తూ మరణిస్తూ మేమా ఎర్రిటి సూర్యునికి లాల్‌సలామ్ చెప్తున్నాం. గంతులు గంతులుగావస్తున్న ఆ కాంతి అన్ని చీకట్లనూ తరిమివేసి మా ప్రాచీనమైన యీ దేశాన్ని వెలుగురవ్వల జడితో నింపివేస్తుంది. యీ వైభవం యీ దేశాన్ని వినూత్నంగా తీర్చిదిద్దుతుంది" అంటూ "విప్లవం వర్ధిల్లాలి" "మార్క్సిస్టు- లెనినిస్టు కమ్యూనిస్టుపార్టీ వర్ధిల్లాలి"అనే నినాదాలతో శత్రువుల బులెట్లు గుండెల్లోనుండి దూసుకపోగా నేలకొరిగారు. వాళ్ళ నెత్తురుతో ప్రిజల ప్రిజాస్వామిక భారత దేశానికి, సోషలిస్టు భారత దేశానికి, విప్లవకారుల స్వప్నానికి ముగ్గుబోశారు.

"వేల వేల మృతవీరులు వీరోచితంగా ప్రిజలకొరకు తమ జీవితాలను అర్పిం చారు. వాళ్ళ జెండాను మనం వున్నతంగా నిలిపి వాళ్ళరక్తంతో మెరుస్తున్న దారిలో ముందుకేసాగుదాం." మన మృతవీరులైన కామ్రేడ్స్ చరిత్రి చేర్మెన్ మావోచెప్పిన యీ మాటల్లోని సారాన్ని మనకందిస్తున్నది.

పడిపోయే చెట్లను లెక్కబెట్టేప్పుడు ప్రిజలనే అరణ్యాన్సంగతి మనం మర్చిపో కూడదు. యివాళ ప్రజారణ్యం వర్ధిల్లుతున్న ప్రజావిప్లవంతో జాజ్వల్యమానంగావుంది. ప్రిజలే యీ వీరోచితమైన నాయకులను సృష్టించారని మనం మరువొద్దు. ప్రజలే ప్రజా విప్లవ గమనంలో ప్రితిక్షణం యిలాంటి యింకెందరో మన నాయకులను సృష్టిస్తున్నా రనే విషయం మనం మర్చిపోవద్దు. యివాళ మన విషాదంగొప్పది. గాఢమైంది. కాని యీ తీవ్రిమైన విచారం లోతైన ద్వేషించదగిన వర్గశత్రువుపట్ల కాలే కసిగా మలచు కోవాలె. మన విచారం ఎంతగాఢమైందో మన గర్వంకూడా అంతగొప్పది. కొలవ డానికికూడా వీల్లేనంతగొప్పది. ఎందువల్లనంటే మన మృతవీరులు పార్టీని కాదన

డమో, చావును కోరుకోవడమో చేయాల్సివచ్చినపుడు నిర్భయంగా చావుకే స్వాగతం చెప్పి తమ నెత్తురు ధారపోసి ఎర్రజెండాను వున్నతంగా ఎగురవేశారు. తమ త్యాగాలతో మనను చలింపచేసి మన కళ్ళను విశాలంగా తెరిపించి మన భుజంమీద యెంత బృహత్తరమైన బాధ్యతవున్నదో గుర్తింపచేశారు. త్యాగాలులేకుండా విప్లవాలుసాధించలేమని మనం గుర్తించుకోవాలె. మూల్యాన్ని చెల్లించకుండా –మన నెత్తురుతోనే మన ప్రాణాలతోనే మూల్యాన్ని చెల్లించకుండా ఫలితాన్ని సాధించలేము. యిది విప్లవసూత్రం. అందుకే చేర్మన్ మావో పోరాటంవున్నచోట త్యాగంవుందని గుర్తుచేశాడు. అయితే అనవసరమైన త్యాగాలుచేయకుండా వుండడానికి మనం చేయదగినంత, చేయగలిగినంత చేయాలని హెచ్చరించాడు.

"స్థిరంగా వుండండి. ఏ త్యాగానికి వెనుకాడకండి. ప్రతి కష్టాన్నీ అధిగమించండి. విజయాన్నిపొందండి"అని చైర్మన్ మావోచెప్పిన మాట మనకు గీటురాయి కావాలి.

---

"కోట్లాది భారత పీడిత ప్రజలకు నేడు 'శ్రీకాకుళం' అనేది ఒక అమర నామం గొప్ప ఆశారేఖ: భారతదేశపు భవిష్యత్ చరిత్రయే శ్రీకాకుళం. ఒక విప్లవకారుని మరణం ఎన్నడూ నిష్ప్రయోజనం కాదు. మీరు చిందించిన రక్తంకూడా నిరుపయోగం కాదు."

"అమరవీరులు– ప్రతి ఒక్కరి మరణం హిమాలయ పర్వతమంత బరువైనది. ఎందుకంటే వారు మనకంటే ఉన్నతులుగా పెరిగిపోయారు. వారి నెత్తుటి ధారలనుండి లెక్కలేనన్ని కొత్త ప్రాణులు పుట్టుకొస్తాయి. అందుకే ఈ దారిలో రేగే ధూళి మన కన్నీళ్ళతో తడవాలి మన రక్తంతో యీ బాటను గట్టిచెయ్యాలి. ప్రతి ఒక్కరూ అగ్నిగుండంలా జ్వలించాల్సిన రోజులివి. ఈ రక్తపు అప్పును రక్తంతోనే తీర్చాల్సిన రోజులివి."

"కామ్రేడ్స్ రక్తంతో అరుణారుణమైన బాటే విప్లవపు బాట !"

– చారుమజుందార్

---

"చిరకాలమైన తమ చేదు అనుభవాలద్వారా అరబ్ ప్రజలు సోవియట్ సోషల్ సామ్రాజ్యవాదం మిత్రుని ముసుగులోవున్న శత్రువు అనే వాస్తవాన్ని గ్రహించారు. బయటపడ్డ శత్రువుకన్నా యీ రకమైన శత్రువు ఎక్కువ ప్రమాదకారి" అని ఇటీవల ఒక రచనలో ఆఫ్రో–ఆసియా రచయితల బ్యూరో పేర్కొన్నది.

## వివాలా! శాంటియాగో! (Vivala! Santiago)

— శివసాగర్

1

శాంటియాగో! శాంటియాగో!
నీ గుండెలపై షెర్మన్ టాంకులు
నలుదిక్కుల నుండి నిన్ను గురిచూసి
కాలుస్తోన్న మెషీన్‌గన్లు, బజూకాలు
నీ శిరస్సుపై హాకర్, హంటర్ జెట్ విమానాలు
నీ అణువణువు నుండి రక్త ప్రవాహాలు।
నీ విశాలనేత్రాల నుండి జాలువారే కన్నీటి ధారలు।
నీ సరిహద్దుకు సీళ్ళు
రాత్రింబవళ్ళు కర్ఫ్యూలు, కాల్పులు
స్టీమ్‌షిప్ లిబూలో చిత్రహింసలు
హార్బర్‌లో ఆరిపోయిన దీపాలు
ఖననాలు, కళేబరాలు, కారాగారాలు
శవపేటికలు, "ఊచకోత ఉత్సవాలు।"
ఉరికంబాలకు వేలాడుతోన్న
శిరస్సుల తోరణాలు।
నీ దేహమంతా పాముల్లా పాకుతున్న
షాక్ట్రూపర్లు।
గుండెలవిసి పోయే కొన్నెత్తురు దృశ్యాలు।
కనుమూసిన కాగడాల కన్నీటి భాష్యాలు।

2

శాంటియాగో! శాంటియాగో!
ఏ విద్రోహం నిన్ను వెన్నుపోటు పొడిచింది?
ఏ విద్రోహం నిన్ను శత్రువుముందు నిరాయుధంగా నిలిపింది?
ఏ విద్రోహం నీకు ప్రజాసైన్యం లేకుండా చేసింది?

ఏ విద్రోహం తుపాకిగొట్టంద్వారానే రాజ్యాధికారం
సిద్ధిస్తుందనే సత్యాన్ని నీ నుండి దాచింది ?
బాలెట్ బాక్స్‌పై మమకారాన్ని రేపింది ?
ఏ విద్రోహం నీ నుదిటిపై 'జకార్తా ! జకార్తా !' అని
క్రూరంగా రాసింది ?

3

శాంటియాగో ! శాంటియాగో !
చూశావా ?
నీ చుట్టూ మండుతోన్న చీకటి మంటల నాల్కల కొసల
జ్వలిస్తోన్న పారిస్ కమ్యూన్ అనుభవాలు !
విన్నావా ?
లా మొనిడా ప్రాసాద ధ్వంసంలో
వినిపిస్తోన్న కామ్రేడ్ లెనిన్ హెచ్చరికలు !
హెలికాప్టర్ల ఫైరింగ్‌లో, జెట్ విమానాల జామ్మింగ్‌లో
ధ్వనిస్తోన్న మార్క్సిస్ట్ చారిత్రక సూత్రం !
తుపాకి గొట్టంద్వారానే రాజ్యాధికారం సిద్ధిస్తుందని
నీవు చిందిస్తోన్న ప్రతి రక్తపుబొట్టు పలుకుతున్న సత్యం !

4

శాంటియాగో ! శాంటియాగో !
నిన్ను అలెండిజం
నిరాయుధం చేసింది
నిన్ను అలెండిజం
నిస్సహాయను చేసింది
నిన్ను అలెండిజం
వివస్త్రనుచేసి ముష్కరుల ముందు నిలిపింది
నిన్ను అలెండిజం
శతృవుముందు బలిపశువుగా విసిరింది.

5

విలపించకు ! శాంటియాగో !
విలపించకు !
నీ విశాల వినీల నేత్రాలనుండి
ఉప్పొంగే అశ్రువుల్ని చూడలేను
విలపించకు ! శాంటియాగో !
విలపించకు !
నీ పెదాలపై నిశ్శబ్దంగా కదిలే
జకార్తా విలాపగీతాన్ని వినలేను
బాధాసముద్ర తరంగాల్లోని
నీ విషాదమూర్తిని వూహించ సాహసించలేను.

6

శాంటియాగో ! శాంటియాగో !
అలెండిజం హత్యచేయబడింది
అలెండిజం ఆత్మహత్య చేసుకుంది
మిత్రుడు ఫైడల్‌కాస్ట్రో కానుకగా ఇచ్చిన
సబ్‌మెషిన్‌గన్‌తో ఆత్మహత్య చేసుకొంటేనేం ?
శత్రువు మెషిన్ పిస్టల్ కాల్పులకు...ఒకటి...
రెండు...మూడు... పదమూడు గాయాలతో
ఈడిగలబడితేనేం !
నేడు అలెండిజం వినాడెల్‌మార్‌లో భూస్థాపితమయింది.
బూర్జువా ప్రజాస్వామ్య జాజ్ మ్యూజిక్‌కు
వూగి వూగి నేడు అలెండిజం హీనంగా నేలకూలింది.
బ్యూనోస్ ఎయిర్స్ టాంగో క్లబ్బుల్లో
తాగితాగి అలెండిజం నేడు హీనంగా కుక్కచావు చచ్చింది.

7

శాంటియాగో ! శాంటియాగో !
విలపించకు !

అలెండీజం మరణించింది
చిలిప్రజ బతికే వున్నారు
ఫ్యాక్టరీలు బతికున్నాయి
ఫ్యాక్టరీల్లో కార్మికులు బతికేవున్నారు
పంపాలు బతికున్నాయి
పంపాల్లో రైతులు బతికే వున్నారు
పసిఫిక్ మహాసముద్రం బతికుంది
మహాసముద్రింపై జాలర్లు బతికేవున్నారు.
సూర్యుడూ, చంద్రుడూ బతికున్నారు
విప్లవకారులు బతికే వున్నారు
అందరి గుండెల్లోనూ నీ రక్తంతో
మరింతగా ఎరుపెక్కిన ఎర్రజెండా
ఎగురుతోంది
అందరి గుండెల్లోనూ
ప్రతీకార క్రోధాగ్ని రగులుతోంది.

8

శాంటియాగో! నీవు వొంటరిగాలేవు
నీవు దిక్కుమాలిన పక్షివి కావు
నీవు ప్రపంచ విప్లవ ప్రాంగణంలో వున్నావు
సోషలిజం తుది విజయం సాధించే శకంలో
నీవూ నేనూ కలిసి కష్టాలు కలబోసుకొంటున్నాం
అనుభవాలు వడపోసు కొంటున్నాం
మనందరం ఒకే స్వప్నం కంటున్నాం
మనందరం ఒకే పోరాటం చేస్తున్నాం

9

శాంటియాగో! శాంటియాగో!
సజల నేత్రాలతోనైనా

నీ చుట్టూ వొక్కసారి చూడు
అనుభవాల కొలిమిలో రాటుదేలిన వీరులు
నీ కోసం లోడెడ్ రైఫిళ్ళతో తిరగబడుతున్నారు
తిరగబడుతున్నారు పంపాల్లో రైతులు కొడవళ్ళతో
అనాకోవ్డా, కిన్నికోట్ రాగిగనుల్లో
కార్మికులు సమ్మెటలతో సంకెళ్ళు బద్దలు కొడుతున్నారు.
లాన్‌క్వీమెలో, సాన్‌గ్రిగోరియోలో
రాంక్విల్‌లో, అరికాలో, కొబిజాలో
పార్కుల్లో, మార్కెట్ స్థలాల్లో
పసిఫిక్ సముద్రతీరంలో, ఎడారి సరిహద్దుల్లో
ఆర్కిపిలాగోలో నీ పుత్రులు
బజూకాలు చేతపట్టి పోరాడుతున్నారు
ఉప్పెనలా లేస్తున్నారు
"చరిత్రపుటల్లో త్యాగం చేవ్రాళ్ళు పెడుతున్నారు."

## 10

శాంటియాగో! విలపించకు,
చనిపోయిన వాళ్ళను నీకోసం మేల్కొలిపి
ఆయుధాలు చేతికిస్తున్నాను
నీకోసం సమరోత్సాహ జలప్రళయగీతాన్ని
నా రైఫిల్‌తో రాస్తున్నాను
ఒకనాడు పాబ్లో నెరూడా పలికించిన
ప్రభంజనానికి విప్లవ వారసునిగా
ప్రపంచ ప్రజాకోర్టులో నీ పేరిట డిమాండ్ చేస్తున్నాను:
"నేను ప్రతీకారం కోరుతున్నాను
నేను రక్తానికి రక్తం కోరుతున్నాను
నేను పంటికి పన్ను కంటికి కన్ను కోరుతున్నాను
శిక్షించండి! మిలిటరీజంటా విషకోరలు పదును
పెడుతోన్న కోకాకోలా సామ్రాజ్యవాదుల్ని శిక్షించండి!

శిక్షించండి! రివిజనిజం మత్తుమందు టన్నులకొద్దీ
అన్ని తీరాలకు దిగుమతి చేస్తోన్న
సోడ్కా సామ్రాజ్యవాదుల్ని శిక్షించండి!
శిక్షించండి, లాటిఫూండియాలను, దళారీలను
మిలిటరీ జంటాను శిక్షించండి!
శిక్షించండి! "బూర్జువా మార్క్సిస్టు"లను శిక్షించండి!

11

ప్రపంచ ప్రజలారా, శాంటియాగో నెత్తురునేర్పిన
పాఠాలను ఎలుగెత్తి చాటండి!
అలెండిజం మరణించిందని, మార్క్సిజం జీవించిందని
ప్రపంచ ప్రజలారా, యుగధర్మాన్ని గొంతెత్తి నినదించండి!
దేశాలు స్వాతంత్ర్యం కోరుతున్నాయని
జాతులు విముక్తి కోరుతున్నాయని
ప్రజలు సాయుధ విప్లవం కోరుతున్నారని
నా దేశ ప్రజలారా! విప్లవగీతాలాపన చేయండి!
చిలీ మార్గం ఓడిందని
నగ్జల్‌బరిమార్గం నిలిచిందని
సకలదేశ శ్రామికులారా!
క్షతగాత్రి శాంటియాగోకు జేజేలు పలకండి
సకలదేశ శ్రామికులారా!
సజలనేత్రి శాంటియాగోకు జేజేలు పలకండి
సకలదేశ శ్రామికులారా!
సమరశీలి శాంటియాగోకు జేజేలు పలకండి!
వివాలా! శాంటియాగో! వివాలా! శాంటియాగో!
రేక్‌ఛియా! శాంటియాగో! రేక్‌ఛియా! శాంటియాగో!
లాంగ్‌లివ్! శాంటియాగో! లాంగ్‌లివ్!

నగ్జల్‌బరి రగిలించిన
అగ్నికణం ఆరలేదు
చారుబాబు వెలిగించిన
క్రాంతిపథం చెరిగిపోదు
వేనవేలు త్యాగధనులు
అమరవీర యోధులంత
చిందించిన నులువెచ్చని
రక్తధార వృధాకాదు
త్యాగం వృధాగపోదు.

ఉవ్వెత్తున త్వరలోనే
రాబోయే తరంగాలు
మారుమూల దారులలో
మూగజీవి హృదయాలలో
మేలుకొలుపు గీతికను
ఆలపించి తీరుతాయి
వెంపటాపు, కైలాసం
మండించిన శ్రీకాకుళం
తిరిగి మరల చలించును
తిరిగి మరల జ్వలించును.

ఎవడు అడ్డగలడు నేడు
చరిత్ర రథ గమనాన్ని?
ఎవడు ఆపగలడు నేడు
సాయుధ ప్రజ సమరాన్ని?
విప్లవయుగ స్వభావాన్ని
మార్చుశక్తి ఇలలేదు.

నిర్మల్ కవితలు మూడు:

## కదలి ముందుకు సాగుదాం

తెలంగాణ పునరావృతం
అయ్యే సమస్య లేదు.

ఆచరణకు దూరమైన
రాద్ధాంతం ఏల మనకు
సన్నద్ధత ముసుగు కింద
ఎంతోకాలం మనలేరు
రివిజనిస్టు విద్రోహులు
బతికి బట్ట కట్టలేరు
కుళ్ళి కంపు కొట్టు శవం
వారికన్న నయం నయం

పుస్తకాల కేమి లోటు
కోట్ చేయటానికి
పేపర్లే కరవాయెనా
బరికి వేయటానికి
పడకకుర్చీ రాజకీయం
ప్రజలిట్టే గ్రహించారు
రివిజనిస్టు గవులుకంపు
విప్లవ ప్రజ పీల్చలేరు

సిద్ధాంతం ఆచరణ
జోడించి పోరాడితే
పోరాటం అందించే
అనుభవాలె కాగడాలు

తెలివిమీరిన వృద్ధులంత
నెత్తినోరు మొత్తుకున్న

తెలివిలేని ముసలివాడు
కొండతవ్వి తీరుతాడు
దేవుడైన పీడితప్రజ
కళ్ళువిప్పి కనికరించి
కొండకొట్టి చదునుచేసి
సమతను నిర్మించితీరు

నుదుట కారు నెత్తురును
నెత్తురుతో కడుగుదాము
గురిపెట్టిన బందూకును
గురితప్పక కాల్చుదాము
వర్గశత్రు మూకలను
వాడితొత్తు సేనలను
సంహరించి సంహరించి
సమర నినాదం చేద్దాం.

తుపాకి బరువనిపించిన
భుజం మార్చుదాముకాని
ఒకతూరి కింద పెడితె
తిరిగి మరల లేపలేము

ప్రజాసేన లేకున్న
ఏమున్నది ప్రజకు మిగిలి
ప్రజాసేన నిర్మించగ
నడుంకట్టి కదులుదాం!
ఎర్రిపొంత అవతరణకు
ఆహ్వానం పలుకుదాం!
కదం కదం కలిపి కలిపి
కదం కదం కదిపి కదిపి
ముందుకు మున్ముందుకు
మున్ముందుకె సాగుదాం!

## నిర్మిద్దాం - సృష్టిద్దాం

దేశం మనది భూములు మనవి
ధరాధిపతులం మనమోయ్
నూతన వ్యవస్థ నిర్మిద్దాం
నూతన మనిషిని సృష్టిద్దాం ॥దేశం॥

రాళ్ళను కొట్టి, బీళ్ళను దున్ని
గనులను తొలిచి, నదులను మలిచి
సకల పంటలను పండించాం
సమస్త సంపద సృష్టించాం ॥దేశం॥

ఆరుగాలము కష్టంచేసిన
ఆకలి మంటలు ఆరుటలేదు
కాలేకడుపుతో కొనఊపిరితో
దుర్భరముగ జీవించడ మెందుకు

జీవనజ్యోతిని వెలిగిద్దాం
దోపిడి పీడన ఎదిరిద్దాం. ॥దేశం॥

భూమిలేని మన రైతులమంతా
భూమిని దున్నే బానిసలమెనోయ్
భూమికి మనలను దూరం చేసి
బానిస బతుకుకు బలికావించిన
భూకామందుల నిర్జిద్దాం
భువిలో సమతను నిర్మిద్దాం ॥దేశం॥

నీ ఇల్లు ఒక నగ్జల్‌బరి
నా ఊరు ఒక శ్రీకాకుళం
ప్రతివాడు ఒక ముషహరి, భేరి
ప్రతిపల్లె ఒక నగ్జల్‌బరిగ
మహాగ్ని జ్వాలలు మండిద్దాం
మరో జగతినే వీక్షిద్దాం. ॥దేశం॥

పదండి ముందుకు పదండి ముందుకు
ఆయుధ మంది ముందుకు పదండి
శ్రామిక శక్తికి కార్మిక యుక్తికి
ఎదురులేదని తిరుగులేదని
విశాల ధరణిలో నినదిద్దాం
విశ్వమంతటిలో వినిపిద్దాం ॥దేశం॥

## వీరయోధుల మహామరణం
## చరితలోనే చెరిగిపోదు

త్యాగమూర్తి చారుబాబుకు
విప్లవాంజలు లివ్వరండోయ్
భరత భూమిలో ప్రజారాజ్యం
పాదుకొల్పగ కదలిరండోయ్ ॥త్యాగ॥

ఖ్యాతిగాంచిన బంగాళంలో
వాసికెక్కిన నక్సల్‌బరిలో
భూమి ఆకాశాలు వణకగ
దిక్కులన్నీ పిక్కటిల్లగ
చారుబాబు పూరించిన
కదనశంఖం వూదరండోయ్ ॥త్యాగ॥

రైతు సాయుధ ఎర్రసేనల
దర్శకత్వపు మేటినేతగ
విప్లవాత్మకమైన పార్టీ
నిర్మాణంలో మంచిదిట్టగ
ప్రియతమనేత చారుచూపిన
మార్గమున పయనించరండోయ్ ॥త్యాగ॥

వీరయోధుల మహామరణం
చరితలోనే చెరిగిపోదని
రివిజనిస్టుల రోత బ్రతుకులు
శవంకన్నా హీనమంచును
చారుబాబు చాటిచెప్పిన
సత్యమును వినదించరండోయ్ ॥త్యాగ॥

తూర్పుపవనం వీచెనదిగో
తూర్పుదిక్కెరుపెక్కె నదిగో
నవ ప్రపంచపు సృష్టికర్తల
ఎర్ర భీభత్సమ్ము అదిగో
చారుశీలి లక్ష్యమునకై
కదంత్రొక్కెడి సైన్యమదిగో ॥త్యాగ॥

అరుణ రేఖలు ఎర్రక్రాంతులు
విప్లవాగ్నుల మహామంటలు
దేశమంతట విసురుతామని
శపథమును గైకొనగరండోయ్ ॥త్యాగ॥

# ఊరు మేలుకుంది

చెరబండరాజు

ఊరు మేలు కొన్నదీ
ఏరు మేలు కొన్నదీ

ఊరిలోని కూలి జనం
చుక్కపొద్దు లేచినదీ
సూర్యునితో నడిచినదీ

ఊరు మేలు కొన్నదీ
ఏరు మేలు కొన్నదీ

ఏటిలోని కోటి అలలు
గలగల నవ్వినవీ
పాపలవలె నడిచినవీ

ఊరు మేలు కొన్నదీ
ఏరు మేలు కొన్నదీ

పశులు దొడ్లు వీడినవీ
అడవిదారి పట్టినవీ
చెట్లు గట్లు విడిచినవీ
పక్షులెటకో పోయినవీ
దినవెచ్చము కొరకుగదా
జీవరాశి కదిలినదీ

ఊరు మేలు కొన్నదీ
ఏరు మేలు కొన్నదీ

ఊరు చివర మాలవాడ
లోన గలడు మల్లిగాడు
చిందితె పాల్గారు ప్రాయ
మున్నవాడు చిన్నవాడు

నూనుగు మీసాలవాడు
మాలవాడ చందురుడూ
తండ్రిలేని బిడ్డవాడు
ముసలి తల్లి ఉన్నవాడు
తూమెదొడ్ల జీతగాడు
పనిదగ్గర మొనగాడు

ఊరు చివర మాలవాడ
లోన గలడు మల్లిగాడు

వాడెందుకో తెలియదు
పని మానీ ఊరుకున్నడూ

కొడుక నీకిది తగదురా — మీనాన్న
పేరు చెడగొట్టొద్దురా

పొద్దు బారేడెక్కెరా — మానాన్న
పొలము కాడీకెళ్ళరా

మనమెంతటోళ్ళమనిరా — మా అయ్య
దొరతోని పగ వొద్దురా

ఊరిలో చీమైననూ — మా అయ్య
దొరకెదురు తిరగదనెనూ

ఊరిలో కాకయిననూ — మల్లన్న
దొరకెదురు పలకదనెనూ

గోడు గోడున ఏడ్చెనూ — ఆ తల్లి
కొడుకుకెన్నో చెప్పెనూ

పొరలి పొరలి ఏడ్చెనూ — ఆ తల్లి
కడుపులో తలబెట్టెనూ — మల్లన్న
కడుపులో తల బెట్టెనూ

దుఃఖమేలమ్మనీ అమ్మనోదార్చడూ
తన దుఃఖమేమిటో తల్లితో చెప్పడూ
మౌనివలె మల్లన్న మంచాన కూర్చుండె

దొరని దొబ్బులుపెట్టి పళ్లు పటపటకొరికె
కొలిమి నిప్పులవోలె కళ్ళు కణకణ మండె
అగ్గిగుండమువోలె మనిషి భగభగ మండె
తల్లి తనయునిచూసి తల్లడిల్లిపోతుండె

ఉట్టిమీదా జొన్న రొట్టెలున్నాయిరా
దమ్ముకేసిన గట్క వెచ్చగున్నాదిరా
ఎంగిలన్నాపడు ఏమొచ్చెనో నీకు

మల్లన్న మల్లన్న నావల్ల కాదురా
మల్లన్న మల్లన్న నావల్ల కాదురా

నిన్ను జూస్తే నాకు మీ అయ్య గుర్తొచ్చె
గుర్తొచ్చి మీ అయ్య గుబులు పుట్టుకొచ్చె

కళ్ళాన జొన్నలూ దొంగలించుకుపోయి
దొరమీద మీసాలు దువ్వేనని విందేసి
ఇంటి ముందటి చెట్టుకూ కట్టేసి
రూళ్ళకర్రతొ కొట్టి కీళ్ళు విరిచారురా

ఆచెట్టు చిన్నదేరా-అప్పుడూ
నువ్వు చిన్నోడివేరా
చెట్టు పూతెయ్యలేదూ – మల్లన్న
నువ్వు బువ్వడుగలేదూ

కొట్టొద్దు కొట్టొద్దు కొడుకు చిన్నోడనీ
కడుపులో తలపెట్టి కాళ్ళు పట్టుకున్న
వినలేదురా దొర వినలేదురా మొర
మీ తండ్రి నా దొరా కొట్టి చంపాడురా
పట్టపగలే బతుకు చీకటయ్యిందిరా

బిచ్చమెత్తి నిన్ను సాదుకున్నానురా
అయ్య బుద్ధులు నీకు ఎట్లొచ్చినాయిరా
మల్లన్న మల్లన్న నావల్ల కాదురా

నువ్వు కూడా పోతె నాకు ఏముందిరా
మల్లన్న మల్లన్న నావల్ల కాదురా

తండ్రి దుర్మరణమూ అగ్నికాజ్యము పోసె
తన సాటి తమ్ములను మనసులో తలపోసె
కాలి జోడుతొ నేల కందెటట్టూ రాచి
కోడె కొమ్ముల నేల కుమ్మినట్టూ లేచి
అంతలోనే కోపతాపాలు దిగమింగి
తల్లితో మల్లన్న మెల్లగా ఇట్లనే

బతుకులేమో మనవి చితికిపోతుంటేను
కాలమేమో చాల మారింది అంటారు
మారలేదే అమ్మ మనవూరు మారలేదూ— మాయమ్మ
ఏవూరు మారలేదు

ఎద్దుపుండును కాకి ముద్దెట్టుకోదమ్మ
పేదోళ్ళ నీ దొరలు ప్రేమించరోయమ్మ
మారలే మారలే ఏవూరు మారలేదూ— ఓయమ్మ
మనవూరు మారలేదూ

కొరడాలతో కొట్టి ఉరికొయ్య లెక్కించి
అయ్యలాంటోళ్ళయ్య లెందరినొ చంపారు
మారలేదేయమ్మ మనవూరు మారలేదూ— మాయమ్మ
ఏవూరు మారలేదూ

బంధూకు పట్టుకొని గాంధి బోధలు చెప్పు
పాతకొత్తా దొరలు బలిసిపోతున్నారు
మారలేదోయమ్మ ఏవూరు మారలేదూ— ఓయమ్మ
మనవూరు మారలేదూ

హరిజనోద్ధరణన్న గాంధిగారిని మించి
మేకవన్నె పులి లోకాన లేదమ్మ
మారలే మారలే ఏవూరు మారలేదూ— మాయమ్మ
మనవూరు మారలేదూ

అప్పులెక్కువ ఇచ్చి ముప్పు తిప్పలుపెట్టి
పొలము గుంజూకొని బొజ్జపెంచిరి దొరలు
మారలే మారలే మనవూరు మారలేదూ— ఓయమ్మ
ఏవూరు మారలేదూ

మాలలని కాదమ్మ మాదిగని కాదమ్మ
కష్టజీవుల బతుకు లేడజూసిన ఇంతె
మారలేదోయమ్మ ఏవూరు మారలేదూ— మాయమ్మ
మనవూరు మారలేదూ

ఊరికంటే అడవి మేలు మేలేయమ్మ
దుంపలో ఆకులో కడుపు నింపావచ్చు
మారలే మారలే మనవూరు మారలేదూ— మాయమ్మ
చెమటోచ్చి చెయిచాచి చెప్పుమేకులవలె
అణిగి మణిగుంటాము సిగ్గులేదే మనకు

మల్లన్న ఒకపరీ మండె గుండెలతోడ
తల్లి ముందుకువచ్చి తల్లడిల్లీ పోతూ
అంగి విప్పి పెయ్యి ఆసాంతమూచూపి
దొరకాళ్ళు మొక్కాలొ శిరసు తెగనరకాలొ
కర్తవ్యమేమిటో సెలవియ్యమన్నాడు

పాడీ ఆవుల నేను
ఎద్దులను ఎల్లన్న
దున్నపోతుల ఖాను
బర్రెలను కొమరన్న
పొద్దుగుంకేవేళ
తోలుకొని వచ్చాము
దొడ్డి చేరంగానె
చిన్నావు సుడివడీ

బురబురా బురబురా నురుగుళ్ళు కక్కింది
పాము కరిచిందనీ పసరు పోసాము

నామెక్కెనని వేపు ఆకు నమిలించాము
మంత్రగాళ్ళు వచ్చి మంత్రించినారు
కట్టమైసమ్మకూ ముడుపు కట్టారు
దొర వెంకటేశునికి మొక్కుకున్నాడు
ఎన్ని చేసిన నేమి ఆవు చచ్చింది
నిమిషాలమీదనే నిద్రనీల్గింది

ఆటు ఆవు కన్ను మూసిందోలేదో
ఇటు నన్ను దొర పట్టినాడూ- మాయమ్మ
వేపచెట్టుకు నెట్టినాడూ- మాయమ్మ
పిడిరెక్కలను కట్టినాడూ- మాయమ్మ
జీతగాళ్ళను పిల్చినాడూ- మాయమ్మ
పులివోలె మీదపడ్డాడూ- మాయమ్మ

లంజ కొడుకన్నాడు దొంగ కొడుకన్నాడు
కడుపులో తన్నాడు కాండ్రించి ఉమ్మాడు
గోటిపై తొక్కాడు ముక్కుపై గుద్దాడు
కళ్ళు పీకాలండు గర్వ మొంగాలండు
పురసాలపై తన్ని గద్దోలె నవ్వెండు
ఎదరొమ్ముపై ముళ్ళగర్రతో పొడిచిండు
మీ అయ్య గతి నీకు తప్పదన్నాడు
నీవల్ల నా ఆవు చచ్చెనన్నాడు
మీతండ్రి పామయ్యి కరిచెనన్నాడు

చింత బరిగెలతోడ తుమ్మ కొమ్మలతోడ
తెలివి తప్పేదాక తెల్లవారేదాక
నెత్తుర్లు చిమ్మంగ కొట్టినాడమ్మ
నేనేమి పాపమ్ము చేసినానమ్మ
పేదవాడికి నేను పుట్టినానమ్మ
జీతగాడిగ బతుకు బతుకుతుంటమ్మ

పెట్రోలుతో కాలబెట్టి చంపాలనీ
ఎల్లన్ననక్కడా కాపలుంచీవాడు

ఇంటికెళ్ళాగానె ఎల్లన్న నను విడిచి
ఇంతదాకా తెచ్చి వెళ్ళిపోయాడమ్మ
ఎల్లన్న కీగతీ దాపురించిందీ
కొమరన్న కేచావు ముంచుకొచ్చిందో

నీ కొడుకు మల్లన్న ఒక్కడేకాదు
మాలవాడని గాదు మాదిగోడని గాదు
కష్టజీవుల బతుకు లేడజూసిన ఇంతె
మారలేదోయమ్మ ఏవూరు మారలే
పాతకొత్తా దొరల గుణమింత మారలే

చెప్పవే మాయమ్మ చెప్పు మాయమ్మ
దొరకాళ్ళ మొక్కాలొ వాడి తల నరకాలొ
కర్తవ్యమేమిటొ నెలవీయవమ్మా
చెప్పవే మాయమ్మ చెప్పు మాయమ్మ

ఉట్టిమీదా రొట్టె నొట్టిపోయింది
కుండలోని గట్క ఎండిపోయింది
బావిలోని నీళ్ళు బావిలోనే వుండె
పొద్దు గుంకిందీ చీకటయ్యింది

మనసులో ఏడ్చుకుంటు
మౌనముగా ఆ తల్లి
కొడుకు వంటిమీద రక్త
గాయాలను తడిమిందీ
భర్తను మది తలచిందీ
బాధల నెమరేసిందీ

దోపిడికీ కులంలేదు
కోపానికి వయసులేదు
వర్గకసికి దయలులేవు
ముసలి తల్లి కాదు ఆమె
బుసకొట్టి పడగెత్తిన
పగబట్టిన పల్లెపడుచు

ఇంటింటా ఇంతేనని
ఊరూరా ఇంతేనని
దొరలుండగ కూలోడికి
కూడునీడ ఉండదనీ
చర చర చర చూరుమీద
కొడవలందు కుంది తల్లి

అమ్మా నీకు తగదమ్మా
కొడుకు చావలేదమ్మా
కొమరన్నలు ఎల్లన్నలు
కోట్లమంది ఉన్నరమ్మ
ఊరు గొడ్డుపోలేదని
అడ్డుపడెను మల్లన్నా

తల్లి పిచ్చిగా నవ్వి
కొడుకు భుజం తట్టిందీ

ఊరు కదిలి ఏరువలె
పొంగి ఏమి చేస్తదయ్య
వేళ్ళు తవ్వబోతె దొరలు
కీళ్ళుకీళ్ళు విరుస్తారు
కొమ్మలిరవబోతె దొరలు
విరుచుకుపడి చంపుతారు

చెట్టుకూలినంక గదా
జనం చేతినిండ పనీ
వేలమంది చెట్టు మొదలు
ఎట్ల నరుకుతారయ్యా
ఒక్కరిద్దరు చాలునయ్యా

శత్రువొక్కడున్నప్పుడు
ఒక కొడవలి చాలునయ్య
ఒక గొడ్డలి చాలునయ్య

మీ అయ్యను మింగినోన్ని
నాచేతులమీద నరికి
మన వూరికి కొత్త వెలుగు
మనసారా పట్టుకొత్తు
అమ్మకడ్డు రాకన్నా
మల్లన్నా నామాటా
మదిలోనా తలవన్నా

నిజంచెప్పి నావమ్మా
నీకు నాకె కాదమ్మా
ఊరికంత దుష్మనాడు
వాడికింక రేపులేదు

తల్లి వెంట బిడ్డుంటడు
వద్దనకే మాయమ్మ
దొర ఇప్పుడు పొలంకాడ
గుర్రు పెట్టుతుంటాడు
మనపని ముగిశాక మరల
ఊర అడుగు పెట్టొద్దూ
అడవిలోకి వెళ్ళాలి
మన అన్నల కలవాలి
దారి నేను చూపిస్తా
ఏరుదాటి పోవాలి

అమ్మకు మల్లన్నతోడు
మల్లన్నకు అమ్మతోడు
సంబరపడి అమ్మ అపుడు
మల్లన్నా తోడురాగ
కూలి కొడుకులందరకీ
ఊరి కొడుకులందరకీ
సుఖం కొరకు నడిచిందీ
తమ సుఖాలు మరిచిందీ

చీకటిలో పెనుగులాట
అమ్మ బలం చాలలేదు
దొరను నరికి తానుకూలి
నేల కొరిగి పోయినదీ

కొడవలితో మల్లన్నా
ఊరుదాటి వెళ్ళినాడు
గొడ్డలితో మల్లన్నా
ఏరుదాటి వెళ్ళినాడు
అడవిదారి పట్టినాడు
అన్నయ్యల కలిసినాడు

ఊరు మేలుకొన్నదీ
ఏరు మేలుకొన్నదీ

వూరిలోని కూలిజనం
రైతుజనం రాళ్ళ జనం
వృద్ధ జనం వృత్తి జనం
మాల జనం బాల జనం

చుక్కపొద్దు లేచినదీ
కొత్త వెలుగు చూసినదీ
ఎగిరి గంతు వేసినదీ
సూర్యునితో నడిచినదీ

వూరు మేలుకొన్నదీ
ఏరు మేలు కొన్నదీ

ఏటిలోని కోటి అలలు
కిల కిల కిల నవ్వినవి
గలగలగల పారినవి
నవ్వుల నురుగుళ్ళు చిమ్మి
పరుగులెత్తి మురిసినవి
గుండె పొంగి ఆడినవి
కొత్తపాట పాడినవి

॥ఊరు॥

## తూర్పున ఉదయించిన ఎర్రజెండా
## ఆకాశంనిండా వెలుగుతుంది

వరవరరావు

నక్సల్‌బరీ, శ్రీకాకుళం, తెలంగాణా
పల్లెలనుంచి ఢిల్లీదాకా ప్రజా చైతన్యం పునాదులమీద
నెత్తురు రహదారులు పోస్తున్నారు కమ్యూనిస్టులు
త్యాగాలు మైలురాళ్ళు
దోపిడీ కంకర్లు సాహసాల పాదాలకింద చదునై పోతున్నయ్
చెట్లకొమ్మల తుఫాను రాపిడిలో
వర్గపోరాటాలు పూస్తున్నయి
నిప్పుపూల గాలులతో ఆచరణ
రివిజనిజం దుమ్మును ఊడుస్తున్నది
నెత్తురుతో మెరుస్తున్న రోడ్డు
శ్రీకాకుళం ఒరలోంచి దూసి
దోపిడీ రాజధాని గుండెల్లో కుచ్చిన కత్తి లాగుతున్నది
ఈ కత్తి అంచుమీద సిద్ధాంతం పదునెక్కుతున్నది
చీకటి నిద్రలో చిదిమిన దీపంలా మెరుస్తున్న కల
గ్రామాల్లో ప్రజలు వర్గచైతన్యంతో మేల్కొంటారు
కళ్ళల్లో తెల్లవారుతూ ఎర్రజెండా ఉదయిస్తుంది

# నెరూడా! నెరూడా!!

కె. వి. రమణారెడ్డి

భూగోళాన్నీ నిర్భరమైన దాని గందరగోళాన్ని కూడా
గుండెలకు హత్తుకొని చెవులనిండా నించుకొన్నవాడా !
గృహ నిర్బంధంలో ఎన్నటికీ వీడని వాగ్బంధంలో
కన్ను మూయవలసి వచ్చిందా చివరకు, పేబ్లో నెరూడా ?

జగతికీ జగజ్జనతకీ రేయింబగళ్ళకీ ఇరుసంజలకీ
జీవకాంతీ సజీవశాంతీ గాఢగాఢంగా కోరుకొన్నవాడా !
బాంబుల బందూకుల శతఘ్నుల దారుణ భాషను వింటూ
పారిపోవలసి వచ్చిందా శ్మశాన ప్రశాంతికి, పేబ్లో నెరూడా ?

జాతి విమోచన పోరాటాలను జీవిత సమర ఘట్టాలుగా
నెత్తుటి గుండెకోత గాట్లుగా మార్చుకొన్న అక్షరయోధుడా !
చిలీ స్వేచ్ఛకీ యాంకీ దాస్యానికీ తుదిపోరు మొదలైనప్పుడు
గెలుపోటములు తేలకముందే తప్పుకొన్నావేం, పేబ్లో నెరూడా ?

ఫేసిస్టు జాగిలాలవాత కుందేలై చిక్కి ప్రాణం విడిచిన
ఫెదరికో గార్సియా లోర్కా సంప్రదాయానికి కలం వారసుడా !
పినోచెట్ తుపాకీగుండ్లు అల్లెండే గుండెల్ని చెండివేసినప్పుడు
కేన్సర్ బాధను మించిన బాధతో జీవితం చాలించావా, నెరూడా ?

స్పానిష్ శిశువుల లేత రక్తానికీ ఫ్రెంచి త్రివర్ణపతాక భంగపాటుకీ
ఫ్రాంకో దౌష్ట్యానికీ హిట్లర్ దౌర్జన్యానికీ కావ్యసాక్షి అయినవాడా !
హైన్యానికి మారుపేరైన సైన్యం కట్టుదాళ్ల తెంచుకొన్నప్పుడు
దైన్యానికి మారు వీధులు ధైర్యం చూపుతున్నప్పుడా పోయేది, నెరూడా ?

ఎడారి నైట్రేట్ గనిలో భూగర్భం బొగ్గుగనిలో ఒళ్ళుగుల్లయ్యే పనిలో
దుమ్ముధూళీ కొట్టుకొన్న మురికి ముఖాల్నీ దేహాల్నీ ముద్దాడినవాడా!
పనివాళ్ల కూలిదాస్యం మీద బాయొనెట్ల బోను మళ్లీ మూసుకొన్నప్పుడు
ప్రవాసంలోకీ విస్మృతిలోకీ పోక తప్పలేదా నీకు, పేబ్లో నెరూడా?

వాల్ట్‌విట్మన్ పేదసమాధి పచ్చలపై నీ కంటి నీలాలు వెదజల్లి
ఏబ్‌లింకన్ చేగొడ్డలి వేట్లకు చేవపాట పల్లవి కూర్చినవాడా!
తారల చారల జండాకింద అంతర్జాతీయ దోపిడి దొంగల తండా
చిరతప్తమై చిలీ లేడిపైకి లంఘించినప్పుడే పోయావేం, నెరూడా?

గీతికావ్య పర్వతం నుంచి వచనగీతి మైదానాలకు ప్రవహించి
గిటార్ సంగీతానికి ఆడే పోరాడే గేయాలు రచించినవాడా!
తంత్రులు తెగి జీవితవాద్యం శ్రవణభేద్య స్వరాలు పలుకుతూంటే
తెంచుకు పోయావా దేశంబంధాలూ జనసంబంధాలూ, నెరూడా?

కళ్లమీదపడి చెదిరే ఎండల మిరుమిట్లను చెళ్ళున ఝళిపిస్తూ
కన్నెవెన్నెల బయళ్లపై పిట్టల్లావ్రాలే చూపులతో కాలాన్ని చూచినవాడా!
గద్దగోళ్ల పట్టు తప్పించుకోలేక దేశం బాధాక్రోశమై గిలగిలలాడేప్పుడు
కాలం గేలమై దేశం చేపైనప్పుడు, ఇప్పుడా పోయేది, పేబ్లో నెరూడా?

అజంతమైన స్పానిష్ భాషచేత దీర్ఘ హ్రస్వాచ్చులతో
అంతర్జాతీయ శ్రామిక మానవతకి మేల్కొల్పులు పాడినవాడా!
ముచ్చుమూకల విచ్చుకత్తుల ముట్టడిలోనూ విప్లవనినాదాలు వింటూగూడా
మనసుపడి పోలేదుకదూ, గమ్యంలేని రమ్యంగాని స్థితికి, అస్థితికి,
నెరూడా?

నా యవ్వనారంభంమీద రగిలే రవ్వల జడివాన కురిపించి
నా కాలాన్ని దుష్కాలాన్ని మెరుపులతో చీల్చిన మొనగాడా!
పేబ్లో నెరూడా!
నెరూడా! నెరూడా!!




(గత సంచిక తరువాయి)

## 15

జనరల్ లిన్‌పియావో నాయకత్వాన, చైర్మన్ మావో పంథాలో ఉమ్మడి ప్రజాస్వామ్య సైన్యం అమెరికా సాయంతో పోరాడుతున్న చియాంగ్ కై-షేక్ దళాల్ని చావుదెబ్బ కొట్టింది. వాళ్ళు మళ్ళా ఈశాన్యంవేపు తలెత్తడానికి వీల్లేకుండా చేసింది. విజయఢంకా మోగింది. జనంలో వుత్సాహం పొంగిపొర్లింది. పోరాటం కొత్త ఒరవడిపెట్టింది.

పుకార్ల మీద సరదా తగ్గింది. కామందులు, వాళ్ళతొత్తులు తమ తమ గూళ్ళలోకి దూరిపోయేరు. జనంవేస్తున్న ప్రతి అడుగు దొంగచాటుగా గమనించడం, వీలున్నపుడల్లా పుకార్లు పుట్టించడం, ఒకళ్ళమీద ఒకళ్ళకి పితూరీలు చెప్పడమే ఇక వాళ్ళు చెయ్యగలిగింది.

జనం రేయింబగళ్ళు భూసంస్కరణ కార్యకర్తల దగ్గరకూ, రైతు సంఘ సభ్యుల దగ్గరకూ తిరుగుతూనేవున్నారు. చిన్నచిన్న గ్రూపులుగా ఇళ్ళల్లోచేరి చర్చించుకోవడం మళ్ళీ మొదలెట్టారు. తెల్లజండా లేపి, కొండ ప్రాంతాలకు వెళ్ళిపోయిన లియూ తె-షాన్ కూడా మళ్ళీ ప్రత్యక్షమయేడు. 'తూ' బండితోలే ఓల్డ్‌సన్ అందరితో "కార్యకర్తలని నానే ఈవూరు తీసుకొచ్చేను" అని చెప్పేవాడు.

యాంగ్ ఇప్పుడు యింకా శ్రద్ధగా పనిచేస్తున్నాడు. భూమి పంచడం అయిపోయేక, ఒక చిన్నగ్రూపుకి నాయకుడయేడు. సియావో, చిన్నవాంగ్, లియూషెంగ్ ఈ చిన్నగ్రూపులను రోజూ కలిసి, దేశపరిస్థితులను గురించి ఎప్పటికప్పుడు చెపుతుండేవారు. పేదవాళ్ళు ఎందుకు తిరగబడతారో చిన్నచిన్న వుదాహరణలతో వివరించేవారు. చైర్మన్ మావో జీవితాన్ని, అతను సాధించిన పనుల్ని కథలరూపంలో చెప్పేవారు.

అలాగే కమ్యూనిస్టుపార్టీ చరిత్ర గురించి *ఎనిమిదవ దళసైన్యం గురించి చెప్పేవారు. *జపాన్ వ్యతిరేక సైన్య గాథల్ని వినిపించేవారు. లియూ-షెంగ్ వాళ్ళకి చాలా పాటలు నేర్పేడు. జనం మావోమీదా, ఎనిమిదో దళ సైన్యంమీదా పాటలు పాడేవారు. 'కమ్యూనిస్టుపార్టీ లేనిదే కొత్త చైనా లేదు' లాంటి పాటలు నేర్చుకున్నారు.

"మీరు మా కళ్ళు తెరిపించినారు బాబూ. ఇప్పుడు మాకు అన్నీ అవుపడుతున్నాయి" అనేవారు వూళ్ళోవాళ్ళు.

కువో, పెద్దలీ ఓరాత్రి మీటింగులయ్యేక వెన్నెల్లో ఇళ్ళకు వెళుతున్నారు. హాన్ ఇంటిముందుగా నడుస్తుంటే, ఇంటిముందు జాగాలో చిన్నవెలుగు కనిపించింది. అదేమిటోనని ఇద్దరు ఆగేరు. అడుగుల చప్పుడు, మాటలూ వినిపించేయి.

"ఆ పందులకాపరి మన పీకలమీదికి తెచ్చేలా వున్నాడు—" హాన్ గొంతు.

"అవును. మన దారికి అడ్డం తీసెయ్యాలి—" పొడుగుమెడ హాన్‌గొంతు.

"అదంత తేలికకాదు. నువ్వు యాంగ్‌నిపట్టి, జాగర్తగా పనికానివ్వు—" హాన్. ఆ తర్వాత గుసగుసలుతప్ప ఏంవీ వినిపించలేదు.

చివరకు మళ్ళీ హాన్‌గొంతు వినిపించింది— "సరే, నువ్వు రాలేకపోతే మీ కుర్రాణ్ణి పంపు."

తలుపు చప్పుడవడంతో కువో, పెద్దలీ చెట్లచాటున నక్కి, మళ్ళీరోడ్డెక్కేరు.

"హాన్ ఇంట్లో పందులకాపరి ఎవరబ్బా? వూ చియా-వూ గాని కాదుగదా?" అని అడిగేడు కువో.

"ఆడే. ఆడి తల్లిని యీ హాన్‌గాడు చెరిచి, ఎక్కడో ముండల కంపెనీలో అమ్మేసినాడు. నీకెరిక లేదా?" అని పెద్దలీ అడిగేడు.

"అయితే హాన్ సేసిన పాపాల జాపితాకి ఇదో కొత్తపద్దన్నమాట. ఆ కుర్రాడు మనకు గురుతునేదేటి? మన గ్రూపులో సేరుసుకోవాల."

"ఆల్లు అనుకుంటున్న యాంగ్ మన యాంగేనా?"

ఇద్దరూ మళ్ళీ స్కూలువేపుకి మళ్ళేరు. జరిగిందంతా సియావోకి చెప్తుంటే చావో, పాయికూడా వున్నారు.

"యాంగ్ ఎలాంటివాడ"ని సియావో అడిగితే

"ఆడూ పేదోడే. గుడ్డముక్కలు అమ్ముకుని బతికేవోడు. సిన్ననాటానికే ఏదైనా సేస్తాడు" అన్నాడు పెద్దలీ.

---

* Anti-Japanese Amalgamated Armies

"హాన్‌తో దోస్తీగా వుంటాడా ?"

"నేదు బాబూ"

"ఓసారి హాన్ ఆడిని బాదేదుకూడా" అన్నాడు కువో.

"జపానోల్లకి నార కావలసినపుడు హాన్ పొన్నుగఱ్ఱ పుచ్చుకుని వూరుమీద పడిపోయేవాడు. తనకి ముట్టజెప్పాలిసింది ఒగ్గిసి ఎవరన్నా నిదరోతే ఆ కఱ్ఱతో బాదీసీవాడు" అన్నాడు చావో.

"శానామంది ఈపులు రుసిసూసిందా కఱ్ఱ" అన్నాడు పాయి.

"నీకు శానామార్లే తగిలుంటాదిగద పాయి ?" అని నవ్వుతూ అడిగేడు కువో, పాయి నిద్రపోతుతనం గుర్తొచ్చి.

స్నేహితుడి వెక్కిరింతని గమనించి "రొండుమూడుమార్లు తగిలినాది" అంటూ లెక్క తగ్గించేడు.

"ఎనిమిది మార్లు తగిలినాదని మీ ఆడదాయి సెప్పింది మరి"

"దాని సిగ్గొయ్య దాని మాటలే నమ్మేవ్ !"

యాంగ్‌ని ఏంచెయ్యడమా అని ఆలోచిస్తున్న సియావో "యాంగ్‌కి రాజకీయ చైతన్యం తక్కువ. అందువల్ల అతనికి మనం సాయపడాలి. భూమి పంపకం కమిటీలో ఎన్నికయేడు కాబట్టి ఆ పదవినించి అతన్నంత తొందరగా తీసెయ్యగూడదు. మీరందరు అతనితో మాట్లాడిచూడండి. మళ్ళీ తర్వాత చూద్దాం" అన్నాడు.

అందరూ వెళ్ళిపోయేరు.

యాంగ్‌కి చిన్నచిన్న సరదాలమీద మోజు యింకా అలాగేవుంది. చావో, కువోలను సంప్రదించకుండా తనే పెత్తనం చేసేవాడు. వాళ్ళంతా చదువురాని వాళ్ళని అతని వుద్దేశ్యం. ఫోసీ అంటే అతనికైనా కొద్ది అక్షరాలుతప్ప ఏఁవీ తెలీదు.

"ఆ కువోగాడెవడు ? ఆడికేం తెలుసు ?" అనేవాడు.

యాంగ్ భూమి పంపకం కమిటీ సభ్యుడైనప్పటి నుండి బేవకూఫ్ గాళ్ళందరు అవనిచుట్టు చేరి, నోరు తీపిచేస్తూండేవారు. దాంతో అందరికీ "అది చేస్తాను, ఇది చేస్తాను" అని హామీలిచ్చేవాడు.

"నాకోపని సేసిపెట్టాల యాంగ్‌బాబూ !"

"తప్పకుండా ! నీకేటికావాలో సెప్పు. పెద్ద కష్టాలని మారిసి సిన్నకష్టాలుగా, సిన్న కష్టాలని అసలు లేకుండా మాయం సేసీగల్ను" అనేవాడు ఎంతోగొప్పగా.

"యాంగ్ బాబూ, కొరెకర్తలతోటి సెప్పి నాకు యిది సేయించిపెట్టాలి"

"ఓస్, అంతేనా? సియావోబాబు నామాట ఎప్పుడూ కాదనడు"

నిజానికి యాంగ్‌కి సియావో అంటే భయం! ఎప్పుడోగాని అతనితో మాట్లాడే వాడుకాదు.

ఓరోజు యాంగ్ మీటింగునించి వెళ్ళేసరికి అతన్ని పొడుగుమెడహాన్ ఇంటికి పిలిచేడన్న సంగతితెలిసింది. అతని సంగతి యాంగ్‌కితెలిసినా మర్యాదకోసం వెళ్ళేడు.

"హాన్‌గారు నిన్నిరాత్రికి భోజనానికి పిలిచేరు" అని చెప్పేడు.

యాంగ్‌కి ఏఁవీ తోచలేదు. వెళితే రైతుసంఘం నియమాలు ధిక్కరించినట్లవుతుంది. వెళ్ళకపోతే మరీ మోటుగా వుంటుంది. చివరికి భోజనానికి వెళ్ళేడు.

కుక్కలు మొరగగానే హాన్ ఓ పొడుగు గౌను వేసుకుని నవ్వుతూ బైటికి వచ్చేడు. యాంగ్‌ని ఎంతో మర్యాదగా తూర్పుగదిలోకి తీసుకువెళ్ళేడు. పైనుంచి వేలాడుతున్న లాంతరు గదంతా వెలుగు నింపింది. కాంగుమీద ఓ తివాచి పరిచివుంది. కాంగుకి ఓపక్కగా మెత్తటి పరుపులు, గులాబిరంగు దుప్పట్లు పొత్తులుగా వున్నాయి. ఓదుప్పటిమీద 'దీర్ఘాయువునికోరుతూ ఓచెట్టుకింద కొంగవున్నట్టు' ఎంబ్రాయిడరీచేసేరు. మరోదానిమీద 'దేవుని దీవెనలు నిండుగా పూచిన చెట్టు' కుట్టేరు. కాంగుకి ఎదురుగా ఓ ఎర్రటిపెట్టె వుంది, దానిమీద బంగారు రంగు పిట్టలు చెక్కేరు. గోడకి పెద్ద అద్దం, పక్కనే అద్దాలపెట్టె— గదిలో అన్నీ తళతళ మెరిసిపోతున్నాయి.

యాంగ్‌ని కాంగ్‌మీద కూచోమన్నాడు హాన్. కాని మరీ అతిమర్యాదగా వున్నట్టనిపించి యాంగ్ ఎర్రటి స్టూలుమీద కూచున్నాడు. హాన్ సిగరెట్‌పెట్టె అందించేడు.

మీటింగుల్లో అందరితోపాటు తనూ హాన్‌ని తిట్టిదిగజారపోసేవాడు. కాని ఇప్పుడవన్నీ మరుగునపడిపోయేయి. హాన్ మంచికి మారిపోయేడనుకున్నాడు. ఎంత మారకపోతే తనని సమాన ఫాయాలో మర్యాదచేస్తాడు! మామూలుగా "ఏమోయ్ యాంగ్!" అని పిలవకుండా ఎంతో మన్ననగా—

"చైర్మన్ యాంగ్! ఇవేళ అరకోడి మాంసంతో భోజనం."

"నన్ను చైర్మన్ అని పిలవాకండి: నాను చైర్మన్‌కాను."

"అయ్యో, నువ్వు చైర్మన్ కాదూ? ఏఁవైనా నువ్వు వాళ్ళందరికంటె మెరుగే. నువ్వే చైర్మనయితే బాగుండేది— ఇదుగో అన్నం వడ్డించండి."

ఒక నౌకరొచ్చి కాంగ్‌మీద అన్నీఅమర్చేడు— చెంచాలు, పళ్ళేలు, *చిన్నకర్రముక్కలు, సారాగిన్నె, ఘుమఘుమలాడే వంటకాలు.

* Chopsticks

"తిను, తిను. ఇంతకంటే ఏమీపెట్టలేను. నీకు కావలసినంత తాగు. మనం పాత నేస్తాలమేగదా చైర్మన్ యాంగ్!"

కాంగ్‌మీద కూచుని మాటాడుతూ, తాగుతూ, తాపీగా భోంచేసేరు. నౌకరు ఒకదాని తర్వాత ఒకటి వడ్డించేడు— కేకులు, మాంసం, పుట్టగొడుగులు, బాతుగుడ్లు, చేపల పులుసు, అరకోడి కూర. హాన్ ఎంతో జాగ్రత్తగా యాంగ్‌ని తాగించేడు, కొంచెంసేపటికే యాంగ్‌కి కైపెక్కింది.

"నేనే దళనాయకుడినైతే నిన్ను రైతు సంఘానికి తప్పకుండా చైర్మన్‌ని చేసేవాణ్ణి. వెండికంటె బంగారం మెరుగైనట్టే నువ్వు కువోకంటె చాలా మెరుగు. మీ యిద్దర్నీ ఎరుగున్నా కనక చెప్తున్నా" నన్నాడు హాన్.

యాంగ్ మారు పలకకుండా కప్పులోకి మరికొంచెం సారా ఒంపుకున్నాడు. హాన్‌కూడా మాట్లాడకుండా యాంగ్‌కి వడ్డిస్తూకూచున్నాడు.

"మరికొంచెం కూరేసుకో, చైర్మన్. నీకు యిష్టమని మసాలా బాగా వేయించేను." అంటూ కూతురు 'అయి-చెంగ్'ని పిలిచేడు.

తలుపుకి వేలాడుతున్న తెల్లకర్టెను తొలగించుకుని హాన్ కూతురు వచ్చింది. తెల్లపాంటు మీద తెల్ల సిల్కుచొక్కా తొడుక్కుంది. ఆ పల్చని చొక్కామీద గులాబి రంగు పూలు. పై బొత్తాములేని చొక్కాలోంచి ఎర్రటి బాడీ కనిపిస్తోంది. దాంతో ఆవిడ జిగేలుమంటోంది. కాంగ్ చివర కూర్చుంటూ యాంగ్‌ని ఓరగా చూసింది. ఓ కప్పులో సారానింపి అతనికి అందించింది. ఆమె చేతులమీదగా, జుట్టులోంచి సెంటువాసన గుప్పునకొట్టింది. యాంగ్‌కి చేతులెక్కడ పెట్టుకోవాలో అర్థంగాక కప్పు గట్టిగా పట్టుకున్నాడు. ఆ కంగార్లో తివాచీమీద, బట్టలమీద సారా ఒలికిపోయింది.

"ఇంకో కప్పు పుచ్చుకో యాంగ్, నాకు పనుంది ఇప్పుడే వచ్చేస్తా" నంటూ హాన్ దక్షిణపువేపు గదివైపు నడిచేడు.

లోపల అతని భార్య అతనితో తగువేసుకుంది.

"చూడు, నాకూతుర్ని అలా పరాయి మగాడిముందు వదిలెయ్యడమేనా?"

"నోర్ముయ్, నీకేంతెలీదు."

హాన్ కూతురు యాంగ్‌కి మరో కప్పు నింపి ఇచ్చింది. ఆమె చూపు తప్పించుకుంటూ, యాంగ్ ఆవిడ లావాటి చేతులకేసి ఆశగా చూసేడు.

"చైర్మన్ యాంగ్, ఇంకో కప్పు తీసుకో. ఇది మానాన్న సొంత సారా జాడీలోది" అంది అయి-చెంగ్.

"ఇక్కడున్నావా? నీకోసం వూరంతా తిరిగేను" అంటూ కిటికీ బైట ఓ తల ప్రత్యక్షమయింది. అతను యాంగ్ గ్రూపులోని చాంగ్ చింగ్-సియాంగ్. కామందు కూతురుతో కలిసి తాగడం చూసి

"ఇక్కడ సుక్కేసుకుంటన్నావా? కానియ్, కానియ్! నాను ఆల్లకి సెప్తాలే" అంటూ వెళ్ళిపోయేడు.

యాంగ్ కప్పుకిందపెట్టి, కాంగ్‌మీదనుంచి ఒక్క దూకుదూకి బైటికి పరుగెత్తేడు. "నానిక్కడున్నానని నీకెవరు సెప్పేరు" అని చాంగ్‌ని నిలదీసేడు.

"అల్లందరు మీటింగుకాడికి ఒచ్చేరు. నీకోసమే సూస్తుంటారు. నువ్ పొడుగు మెడోడి కాఢికెల్లేవని కొట్టో చెప్పేరు. అక్కడనించి యిటు కాసి ఒచ్చేను. నీసిత్త మొచ్చినట్టు తప్పులుసేసీసి నామీద ఎగురుతున్నావేటి? హాన్‌గాడి పిల్లతో తాగుతుండా వని ఆల్లతో సెప్తానుండు" అన్నాడు చాంగ్.

ఇక లాభంలేదని యాంగ్ అతన్ని మెత్తబరచాలని చూసేడు.

"సూడు, నువ్ కానా మంచోడివిగదా? ఆల్లకి నువ్వేటి సెప్పకు. నానే అంతా సెప్పుకుంతాను. నాతప్పు నేనే దిద్దుకుంతాను."

అతను తప్పు ఒప్పుకోబట్టీ, రైతు సంఘంలో పెద్దకాబట్టీ జరిగిందంతా రహస్యంగానే ఉంచుతానన్నాడు చాంగ్.

సియావోతో యాంగ్ తనకి తలనొప్పిగా వుండి మీటింగుకి రాలేదని చెప్పేడు. కీలుబొమ్మ మంచుకో ప్రభుత్వంలో చాంగ్ జపానోళ్ళకోసం పనిచేసేడనీ, ఉత్త దగా కోరనీ చెప్పి,

"అలాటోడిని మన సంగంలో వుంచొచ్చా?" అని అడిగేడు యాంగ్.

"ఆసంగతి నేను చూసుకుంటానులే" అన్నాడు సియావో.

ఆ మర్నాడు యాంగ్ మళ్ళీవచ్చి సియావోతో

"ఆ ఏడాది* ఆగస్టు పదేనోతేదీన జపానోల్లు లొంగిపోనాక చాంగ్ ఆల్ల మందుగుండు, ఓ తుపాకీ దాచీసీడు" అని ఫిర్యాదు చేసేడు.

అది నిజమో, అబద్ధమో తేల్చుకోలేక, కొంతకాలం చాంగ్‌ను రైతు సంఘం నుంచి తీసేద్దామని నిర్ణయించేరు.

మరో రెండురోజులుపోయేక హాన్ యాంగ్‌ని మళ్ళీ ఆహ్వానించేడు. ఈమారు అర్థరాత్రిదాకా కబుర్లు చెప్పుకుంటూనే వున్నారు. యాంగ్‌కి బాగా కైపెక్కగానే కర్టెన్‌కేసి చూడసాగేడు. అతనికేం కావాలో తెలిసినా హాన్ వూరుకున్నాడు.

* 1945 సం॥

"అందరూ నిద్రపోయేరా బాబూ?" అనడిగేడు.

ఏం ఎరగనట్లు "ఎవరూ?" అన్నాడు హాన్.

"మీ యాడమనిసి"

ఒకళ్ళని మించినవాళ్ళు మరొకరు. ఒకడు కపటి, మరొకడు అబద్ధాలకోరు; ఒకడు దగుల్బాజీ, మరొకడు దగాకోరు. ఎవరికేం(వి కావాలో తెలిసీ, తెలీనట్టే నటిస్తున్నారు.

"అవునవును, దానికి ఒంటో బాగోలేదు. నిద్రపోయి వుంటుంది" ఏదో దాస్తున్న ధోరణిలో అన్నాడు హాన్.

వెళ్ళిపోవడానికన్నట్టు లేచేడు యాంగ్.

"అప్పుడే ఏం తొందర? ఛైర్మన్, నిన్నొకటి అడగాలి, కూర్చో" అంటూ హాన్ ఓ గదిలోకి వెళ్ళి మళ్ళీ వెంటనే బైటికి వచ్చేసేడు.

"కిందటిసారి నువ్వొచ్చినప్పుడు నీ పాంట్‌కి చిరుగులు కనిపించేయట మా అమ్మాయికి. అందుకని నీకు కొత్త బట్టలు కుట్టేందుకు నీ కొలతలు తీసుకుంటుందట. 'పేదలు బాగుపడాలి, బాగుపడాలి అన్న అరుపులేతప్ప వాళ్ళు బాగుపడిందెక్కడ? ఛా, ఇది అన్యాయం' అంది. 'చావో, కువో వీళ్ళంతా ఎందుకూ పనికిరారు. అసలు యాంగ్ పేరు పక్కన వాళ్ళ పేర్లుండడమేమిటి? కోకిలలు, కాకులు ఎప్పటికీ ఒకటి కాలేవు. నేనయితేనా...'అంది. 'మరీ చిన్నపిల్లలా మాట్లాడకు'అన్నా"నన్నాడు హాన్.

యాంగ్ నోరు తెరిచి వింటూ వుండి పోయేడు.

"లోపల గదిలోకి వెళ్దామా?" అన్నాడుహాన్.

కర్టెన్ పక్కకి తీసేడు, యాంగ్ లోపలికి వెళ్ళేడు. గోడకు తగిలించిన పెద్ద దీపపు వెలుగులో అతనికి ఏదో కనిపించింది- ఎదురుగావున్న భోజనం, సారా కాదు, ఖరీదుగల సామానుకాదు, గోడకున్న పసందైన తైలవర్ణ చిత్రింకాదు, ఎర్ర సిల్కు కర్టెనులుకాదు, తలుపు మీదగావున్న అద్దంకూడాకాదు- కాని కాంగ్ పక్కగా నుంచున్న ఆవిడ కనిపించింది, నీలంరంగు సిల్కుపేంటు మీద తెల్లసిల్కు చొక్కా వేసుకుంది. ఆచొక్కా తూనీగ రెక్కలంత పల్చగావుంది. దాని అడుగున, పుబికిన రొమ్ములమీద గులాబీరంగు బాడీవుంది. అప్పుడే నిద్రలేచిన దానిలాగా జుట్టంతా భుజాల మీదికి పడుతోంది. యాంగ్ గుండె రెపరెప లాడింది. వలలో పడిపోయేడు.

హాన్ అతన్ని కాంగ్ మీద కూచోబెట్టి 'ఇప్పుడే వస్తా నంటూ వెళ్ళిపోయేడు.

యాంగ్, హాన్‌కూతురు వరసగా మూడు కప్పుల సారా తాగేరు. ఆవిడకి తొందరగా కైపెక్కింది. బుగ్గలు ఎర్రబడ్డాయి. బాడీ కనపడేలా చొక్కా బొత్తాములు విప్పుతూ "అబ్బ, ఎంత వెచ్చగావుందో!" అన్నది.

కిటికీలోవున్న గంధపుచెక్క విసరనకర్ర తీసి యాంగ్ కిచ్చింది. అతని దగ్గరకి వెళ్ళి "నాకు విసరవూ?" అంది.

యాంగ్‌కి వెర్రెత్తిపోయింది. విసనకర్రిలాక్కుని ఎంతగట్టిగా విసిరేడంటే, అదికాస్త విరిగి పోయింది. దాంతో ఆయి-చెంగ్ విరగబడి నవ్వింది. ఓ బల్లమీదపడి పొట్ట పట్టుకుంటూ "అమ్మ, నవ్వీ నవ్వీ నా పొట్ట పగిలిపోయేలావుంది" అంటూ తల వెనక్కి విసిరి మళ్ళీ నవ్వింది. "ప్రేమకి నవ్వునాంది" అని ఆ ముండకి తెలుసు. తన నవ్వుతోనూ, బొద్దు చేతులతోను, 'మొరిటాతారో' మీద ప్రదర్శించిన గమ్మత్తులతోను యాంగ్‌ని లొంగదీసుకోవాలని చూస్తోంది.

యాంగ్ చటుక్కున విసనకర్రి ఒదిలేసి, ఆవిడ మీదికి దూకేడు. ఆమె జాగ్రత్తగా తప్పించుకుంది. నవ్వడం ఆపి "ఏమిటీ, నీకేంవైనా పిచ్చా? ఏంకావాలి?" అంది మత్తుగా.

దానితో యాంగ్‌కి ఇంకా వెర్రెత్తిపోయి ఆవిడ భుజాలు పట్టుకున్నాడు.

"అమ్మా, తొందరగా రా! నన్ను చంపేస్తున్నాడు!" అని పెద్దగా అరిచింది హాన్ కూతురు. వెక్కి వెక్కి ఏడ్చింది.

'ధన్'మని తలుపు తెరుచుకుంది. హాన్‌భార్య, ఉంపుడుకత్తె వచ్చేరు.

"ఏంవైంది?" భార్య అరిచింది.

"ఏం జరిగింది?" ఉంపుడుకత్తె కీచుమంది.

యాంగ్ ఆ పిల్లని ఒదిలేసేడు. ఆమె బల్లమీద తూలిపడింది. దానిమీదవున్న భోజనం, చారు, సారా, కప్పులు, పచ్చళ్ళు, మురబ్బా, డ్రింకులు, చేపలు, కోడికూర- అన్నీ పడిపోయేయి. కాంగ్‌మీద కొన్నీ, యాంగ్‌మీద కొన్నీ, హాన్ కూతురిమీద అంతా పడిపోయేయి- అన్నీ కలిసి అదోరకం వాసనొచ్చింది.

హాన్ లోగిట్లోవున్న జనమంతా గదిలోపల, బైట మూగేరు- ఉన్న గందరగోళం చాలదన్నట్టు.

ఆయి-చెంగ్ తల్లి సందిట చేరింది. కన్నీళ్ళురాకుండా ఏడుస్తూ, ముక్కు ఎగబీలుస్తూ, కాళ్ళు నేలకేసి కొట్టింది.

"అమ్మా" అని అరిచి మళ్ళీ ఏడవసాగింది. యాంగ్ బుర్ర తిరిగిపోయింది. బైటికి పోదామంటే జనం అడ్డేసేరు.

"ఎక్కడికి పోతున్నావ్ ?" కూతుర్ని వుంపుడుకత్తె వేపు తోసి, యాంగ్‌మీదపడి ముఖం రక్కి, బట్టలు చింపేసింది హాన్‌భార్య.

"నాకూతుర్ని నాశనంచేసేవ్‌రా ! దాని గదిలోకిపోయి, చెరిచేవు ! పైకి మనిషిలా కనిపించే చిత్తకార్తె కుక్కవిరా నువ్వు. అదింకా చిన్నపిల్ల. దానికి పందొమ్మిదేళ్ళు. దానికి పెళ్ళెలాగవుతాదిరా ? నిన్నుకాల్చినా పాపంలేదు !" అంటూ కూతుర్ని ఓ ఐదేళ్ళ చిన్నదాన్ని చేసింది తల్లి.

తల్లికి వత్తాసుగా యింకా అరిచింది ఆయి-చెంగ్ ఇంకా రక్కుతూ కాళ్ళు కొట్టుకుంటూ.

"నిన్ను ముక్కలు ముక్కలుగా నరికి కాకులకు, గద్దలకు వెయ్యాలిరా" అని వుంపుడుకత్తె కూడా మాటకలిపింది.

ఇంతలో జనం పక్కకి తప్పుకుని హాన్‌కి, అతని అంగరక్షకుడు లీ చింగ్-షాన్‌కి దారిచ్చేరు. తండ్రిని చూడగానే 'నాన్నా' అంటూ అతనివైపు పరుగెత్తింది.

"నిన్ను ముక్కలు ముక్కలు చెయ్యాలిరా" అంటూ మళ్ళీ అరిచింది వుంపుడుకత్తె— ఈమారు యాంగ్ బుగ్గలు పొడుస్తూ.

"నాన్నా, నాముఖం ఎలాచూపేదీ ?" అంటూ తడిలేని కళ్ళు ఒత్తుకుంది.

"ఏఁవిటీ ?" అని మూగవోయినట్టు ఆగిపోయేడు హాన్. అందరూ ఏక కంఠంతో అరవసాగేరు.

చివరికి కామందు నెమ్మదిగా:

"నిన్ను ఇన్నాళ్ళూ మనిషిగా చూచేను. నా ఉప్పుతిని, నాకే ఎసరుపెడతావురా ? నా కూతురినే చెడగొడతావా పశువా ? నువ్వు చేసినతప్పు ఎలాటిదో తెలుసా ?" అన్నాడు.

కొంచెం ఆగి, యాంగ్‌ని తీక్షణంగా చూసి, మళ్ళీ అరిచేడు

"లీ ఎక్కడ ?"

"ఇక్కడ దొరా !" లీ చింగ్-షాన్ ముందుకొచ్చేడు.

"వీడిని కట్టేసి, కార్యకర్తల దగ్గరకి పంపు. వాళ్ళకేసు తీసుకోకపోతే జిల్లా కార్యాలయానికి పంపు" అంటూ హాన్ సైటగదిలోకి వెళ్ళిపోయేడు.

లీ, మరో నౌకరు కలిసి యాంగ్‌ని కట్టేసి సైటగదిలోకి తోసేరు. యాంగ్‌ని రెండుమార్లూ మర్యాదచేసిన కాంగుమీదే హాన్ దర్జాగా కూర్చున్నాడు. అక్కడి నుండే తీర్పు యివ్వబోతున్నాడు. ఏం చెప్తాడోనని ఆత్రంగా ఎదురుచూస్తున్నాడు యాంగ్.

"నువ్వే చెప్పు, నాకూతుర్ని చెరిచినందుకు నీకేంశిక్ష కావాలి ?" కీలుబొమ్మ మంచుకో ప్రభుత్వంలో వాడిన పొన్నుగర్ర ఆడిస్తూ అడిగేడు హాన్.

యాంగ్‌కి ఏంచెప్పడానికి తోచలేదు.

"మాటాడవేంరా ?" వెనకనించి లీ అరిచేడు.

"చమించాలి బాబూ, సుక్కేక్షువయిపోనాది—" మొదలెట్టేడు యాంగ్. హాన్ అతన్ని ఆగమని, చూస్తున్న జనాన్ని వెళ్ళిపొమ్మన్నాడు. భార్యని, వుంపుడుకత్తెని కూడా పంపేసేడు. "నువ్వుకూడా వెళ్ళి పండుకోమ్మా, పొద్దుపోయింది. నువ్వేం బాధ పడకు. పీడిపని నేనుపడతా. వెళ్ళమ్మా, వెళ్ళు మరీ, అదీ— మా బంగారు తల్లి" అంటూ కూతుర్నికూడా పంపేసేడు.

అందరూ వెళ్ళిపోయేక, అంగరక్షకుడిని కాగితం, కలం తెమ్మన్నాడు హాన్. దానిమీద ఏదోరాసి. లీ చింగ్-షాన్‌కిచ్చి,

"వాడికిది చదివి వినిపించు" అన్నాడు.

"నేను— అనగా యాంగ్ ఫూ-యువాన్, అర్ధరాత్రి హాన్‌గారి ఇంట్లో చొరబడి, వారి అమ్మాయిని చెరచాలని చూసేను. ఆ అమ్మాయి లొంగకపోతే ఆమెని కాంగ్ మీదికితోసి బలవంతాన ముద్దుపెట్టుకున్నాను. అక్షరాలా ఇంతే జరిగింది."

"కాని నేను ముద్దెట్టుకోనేదు" అని నసిగేడు యాంగ్.

"కాదనడానికి నీకెన్ని గుండెలురా ?" పొన్నుగర్ర ఆడించేడు హాన్. దానితో యాంగ్ బెదిరిపోయి చెయ్యని తప్పు ఒప్పేసుకున్నాడు.

"సరే, నీకెలాటి శిక్షకావాలి— కఠినమైనదా, మెత్తటిదా ?"

"ఆరొండు ఎలాంటియో సెప్పండిబాబూ"

"ఈ కాయితంమీద నీ వేలిముద్ర వెయ్యి. అదే మెత్తని శిక్ష."

ఆ మార్గమే ఎన్నుకున్నవాడిలా గబగబ సిరాలో వేలుముంచి ముద్రవేసేడు యాంగ్.

కట్లు వూడదీయించి, లీని పంపేసేడు హాన్. మళ్ళీ అంతా నిశ్శబ్దంగావుంది. అప్పుడప్పుడు నిద్రపోతున్నవాళ్ళ గురకలు, గుర్రాలు మేస్తున్న చప్పుడు, బాతుల అరుపులు వినిపిస్తున్నాయి.

"ఇప్పుడు నువ్వు, నేను ఒకే స్థితిలోవున్నాం. నీకేమైనా కబుర్లు తెలిసేయా ?" అంటూ యాంగ్‌ని ఓరగా చూసేడు హాన్.

"నేదు బాబూ" అన్నాడు యాంగ్.

"ఎనిమిదవ దళ సైన్యం హార్బిన్‌కు తూర్పుగా వెళ్ళిపోతోంది. నేను ముందే చెప్పలా వాళ్ళు యిక్కడ ఎక్కువకాలం నిలవలేరని ? చూడు— కొమింటాంగ్ సైన్యం రావడం ఎంత ఆలస్యమయినా *పున్నమి పండగనాటికి తప్పకుండా వచ్చేస్తారు."

* moon festival

"ఇక్కడికి కొమింటాంగోళ్ళు రాలేరు" అన్నాడు యాంగ్.

"ఎవరా చెప్పింది? వాళ్ళమాట నమ్మకు. నాకు మా అబ్బాయి పుత్తరంరాసేడు" చియాంగ్ కై-షేక్ దెబ్బతిన్నాడని వినికూడా అబద్ధమాడేడు హాన్.

"ఇంకేం రాసినాడు మీ అబ్బాయ్?"

"'మన ఇల్లూ, భూఁవీ తీసుకుంటే నేను వాళ్ళ తలలు తీస్తానని చెప్ప' మన్నాడు."

యాంగ్ వణకడం చూసి హాన్ "భయపడకు. నిన్ను ఇంతకాలంగా ఎరుగున్నాను కదా, నీ ప్రాణానికి నా ప్రాణం అడ్డు. ఇకనుంచీ కార్యకర్తలతో కలవకు. సియావో చేతిలో ముళ్ళపంది పడినట్టయింది. దాన్ని విడిలించనూ లేదు, పట్టుకోనూ లేదు. నన్ను ఓడించగలదా? మూడుసార్లూ ఏంచెయ్యలేకపోయేడు. నేను లక్షణంగా వున్నాను. ఇంకో మూడుసార్లి లాగేజరగనీ. మిమ్మల్ని మించిపోతాను. చూస్తూవుండు" అని డంబాలు పలికాడు.

కోడికూసింది. హాన్ యింకా రహస్యంగా మాటాడేడు. "నువ్వు నాకిప్పుడు సాయం చేసిపెట్టు. నీ ఋణం వుంచుకోను. ఇప్పటికి చాలా మీటింగులయేయి కదా, ఏఁవంటారు వాళ్ళు? అవన్నీ నువ్వుతెల్సుకుని నాకు చెప్పాలి. నీకేయిబ్బంది రాకుండా నేను చూసుకుంటాగా. ఆయి-చెంగ్ నీకు కొత్త బట్టలు కుట్టిపెడుతుంది. నీకు నీలం రంగు ఇష్టమేనా? అయితే నాదగ్గర నీలంరంగు గుడ్డవుంది. నా కూతురు ఎప్పుడూ నా దగ్గరే వుండిపోదుగదా, దానికీ పెళ్ళిచెయ్యాలి. నిన్ను చేసుకునేది, లేనిది ఇప్పుడే చెప్పలేదేమో మా పిల్ల. కాని దానితో మాట్లాడి చూస్తా. తొందర్లోనే ఒప్పుకోవచ్చు" అన్నాడు.

"హాన్ బాబూ, నువ్ శానామంచోడివి. నువ్ ఏదిసెప్తే అది సేస్తా"నన్నాడు యాంగ్— ఆయి-చెంగ్ బొద్దు చేతులు గుర్తుతెచ్చుకుంటూ.

"మంచిది. నువ్వికవెళ్ళిరా, తెల్లారుతోంది. ఏదన్నా చెప్పాల్సింది వుంటే పొడుగుమెడ హాన్‌కి చెప్పు. వాడొచ్చి నాకు చెప్తాడు" అన్నాడు హాన్.

## 16

బెదిరించి, మాయచేసి ఎలాగైతేనేం యాంగ్‌ని తనవైపుకి తిప్పుకున్నాడు హాన్. రైతు సంఘం రహస్యాలు, కార్యకర్తల రహస్యాలు యాంగ్‌వల్ల తెల్సుకోవచ్చనుకున్నాడు. కాని అతననుకున్నట్టు జరగలేదు. యాంగ్ హాన్ ఇంటికి వెళ్ళడం, హాన్

కూతురుతో తాగడం, తగువపడం, హాన్ మళ్ళీ బతిమాలడం— అంతా రైతు సంఘానికి తెలిసిపోయింది.

ఓ మీటింగులో యాంగ్‌ని సంఘంలోనుంచి తీసేసేరు. అదే మీటింగులో వాంగ్ చింగ్-సియాంగ్ దగ్గర తుపాకి లేదనీ, అదంతా అబద్ధమనీ కూడా తేలింది. అతన్ని యాంగ్‌ని తీసేసిన గ్రూపులో వేసేరు. వాంగ్ చింగ్-సియాంగ్‌కి మళ్ళీ సభ్యత్వం యివ్వడానికైతే అందరూ ఒప్పుకున్నారు గాని అతను యాంగ్‌ని మొదటిసారి హాన్ ఇంట్లో చూడగానే సంఘంలో వాళ్ళకి చెప్పనందుకు విమర్శించేరు.

ఊరంతా యాంగ్‌గురించే చెప్పుకున్నారు, "మన ఉప్పుతిని పగవాడి చంకకింద దూరతాడా? యాంగ్‌గాడినంత తేలిగ్గా ఒదలడం ఆడి అదురుట్టం" అన్నాడు చావో.

"ఆడినిసూస్తేనే నాకు ఒల్లంతా తేళ్లు, జెర్రులు పాకినట్టుంటాది" అన్నాడు కువో.

"ఆడో పురుగు ఎన్నెముకేనేదు" అన్నాడు పెద్దలీ.

"ఇన్నాల్లు చింకిగుడ్డలు సూసుకునేవోడు. ఇప్పుడు ముండల్ని సూసుకుంతన్నాడు" అన్నాడు పాయి. అందరూ నవ్వేరు.

ఓల్డ్‌సన్ యాంగ్‌ని రోడ్డుమీద చూడగానే, "చైర్మన్ బాబూ, ఎక్కడికి పోతున్నావ్?" అని నవ్వుతూ అడిగేడు. యాంగ్ ముఖం తిప్పేసుకుని వెళ్ళిపోతుంటే "ఆడూ ఓ చైర్మనే— హాన్‌గాడి కుక్క" అని నెమ్మదిగా అన్నాడు ఓల్డ్‌సన్.

ఒకప్పుడు అటో ఇటో తేల్చుకోలేకపోయిన లియూ తె-షాన్ కూడా యాంగ్‌కి చురకంటించేడు. "ఆడికి ఆకలేటి? మొరిటాతారో ఒగ్గేసిన కూడ తింతన్నాడు."

యాంగ్ ఇంక యువాన్ మావోలో వుండలేకపోయేడు. పొరుగూర్లో పిల్లి చర్మాల వ్యాపారం పెట్టేడు. జనం అతన్ని మర్చిపోయేరు.

హాన్‌కి ఓపిక చచ్చిపోయింది. తెల్లమేక, పొడుగుమెడ హాన్, లీచెన్-చియాంగ్ ఇంక పనికిరారనుకుంటే యాంగ్‌కూడా పోయేడు. ప్రజల్లో గ్రూపు సమావేశాలు పెరిగేయిగాని వాళ్ళు ఏం మాట్లాడుకుంటున్నారో వీసమెత్తయినా తెలీదు హాన్‌కి. వాళ్ళింకా తనవి పట్టుకోవాలనే చూస్తున్నారా? ఏమో, అతనికి ఏంవీ తెలీదు. అతనికి నిద్ర కరువైపోయింది. కిటికీలోంచి ఖాళీ జాగాలోకి చూస్తూ కూర్చునేవాడు.

కొమింటాంగ్ సైన్యం ఎప్పటికీ యిక్కడికి రాలేదనుకున్నాడు హాన్. బాగా ఆలోచించి మిగిలిన విలువైన వస్తువులన్నీ దాయాలనుకున్నాడు. రాత్రుళ్ళు పెరటిగోడ దగ్గర, కట్టెల మోపుల పక్కన గునపాలమోత వినిపించేది.

గుర్రాల డెక్కలకి దూదిచుట్టి, లీ చింగ్-షాన్‌వాళ్ళు చాలా బళ్ళని వూరుదాటించేశారు. కాని యీ సంగతికూడా రైతు సంఘానికి తెల్సింది. పాయి ఈబెలిచ్చి యిద్దరు మనుషుల్ని హాన్ ఇంటి ముందు పగలు, రాత్రి కాపలా పెట్టేడు. మిగిలిన సామాను ఎటూ కదల్చలేకపోయేడు హాన్.

అసలు తన ఇంట్లో జరుగుతున్నదంతా రైతు సంఘానికి ఎలా తెలుస్తోంది? హాన్‌కి అర్థంకాలేదు. రైతు సంఘం ప్రజా సంఘం. హాన్‌ని, హాన్ తొత్తుల్ని ఓకంట కనిపెడుతూనే వున్నారు.

వూ చియా-వూ-హాన్ పందులకాపరి. అతనికి పదమూడేళ్ళుంటాయి. ఇంతకు ముందు హాన్, పొడుగుమెడ హాన్ ఇతని గురించి చెప్పుకుంటుంటేనే కువో, పెద్దలీ విన్నారు. ఓరోజు వూ తనకి రెండింతలున్న కర్రతో పందుల్ని తోలుకొస్తుంటే కువో కబుర్లలోకి దించి, వాళ్ళ గ్రూపులో చేరమని సలహాయిచ్చేడు.

ఆరాత్రే, హాన్ యింటిల్లపాదీ నిద్రపోతూండగా, నెమ్మదిగా కాంగు దిగి, అడుగులో అడుగేసుకుంటూ బైటకొచ్చి తలుపుతీసుకొని మీటింగుకి వచ్చేసేడు వూ. అక్కడ తనగోడు అంతా చెప్పుకున్నాడు. వూ తండ్రి చనిపోయేక, అతని తల్లిని హాన్ వుంచుకున్నాడు. ఏడాదికే విసుగెత్తిపోయి ఆవిణ్ణి షవాంగ్‌చెంగ్‌లో ఓ కంపెనీకి అమ్మేసేడు. వూ హాన్ పందుల్ని నాలుగేళ్ళు కాసేడు. నిరుడు పని మానేస్తానంటే వీల్లేదనేసేడు హాన్. "నీ అబ్బని పూడ్చేందుకు అయిన సొమ్మంతా నువ్వు పైసల్తోసహా చెల్లిస్తేగాని నిన్ను ఒదలను. బాబుచేసిన అప్పు కొడుకు తీర్చాల్సిందే. నా పందుల్ని మరో అయిదేళ్ళుకాస్తే ఆ తర్వాత చూద్దాం" అన్నాడు హాన్.

ఇదంతాచెప్పి "కువో అన్నా, నువ్వే నన్ను కాపాడాల"న్నాడు వూ కన్నీళ్ళతో.

"నీ సంగతి మాం సూసుకుంతాంగా, కళ్ళు తుడుచుకో" అని ధైర్యం చెప్పేడు కువో.

అదిమొదలు రోజూ రాత్రిపూట వూ తన గ్రూపు దగ్గరకువచ్చి ఆసామి ఇంట్లో జరిగినవన్నీ చెప్పేవాడు. యాంగ్ హాన్ ఇంటికి వెళ్ళడం, హాన్ సామానంతా బైటికి చేరెయ్యడం- ఇవన్నీ రైతు సంఘానికి ఇలానే తెలిసేయి. ఈ గ్రూపులో చేరేక వూ ఎప్పుడూ నవ్వుతుండేవాడు.

హాన్ కొలువులోవున్న నాలుగేళ్ళు వూకి నవ్వంటే తెలీదు. పదమూడో ఏడొచ్చినా పదేళ్ళవాడిలా కనిపించేవాడు. ఈడుకి మించిన పనివల్ల అతని దుమ్ములు బైటపడ్డాయి. ఇరవై పందుల్ని, వాటి పిల్లల్ని అన్నీ వూ ఒక్కడే చూసుకోవాలి. సాయం

త్రం ఇంటికి తిరిగొస్తే ఏవో నాలుగు మెతుకులు దొరికేవి. ఇలా రోజులతరబడి ఏళ్ళతరబడి సాగిపోయింది. మిగతా నౌకర్లతోపాటే అతనుకూడా పందులదొడ్డి పక్కనే వాములదొడ్లో పడుకునేవాడు. రాత్రుళ్ళతనికి నిద్రపట్టేదికాదు- కంపు, కంపుకితోడు దోమలు. శీతాకాలంలో దుప్పటిలేక చలికి వణుకుతూ చాలాసార్లు లేచికూర్చునేవాడు. అతన్ని తిట్టడానికి తప్ప ఎవరూ పన్నెత్తి పలకరించేవారుకాదు. హాన్ బంటు చాలా సార్లు అతన్ని కొట్టేడు. ఇదంతా చెప్తూ వూ ఏడ్చేసేడు. చాలామంది ఆడవాళ్ళు, పిల్లలు కూడ ఏడ్చేరు.

పదిహేను రోజుల్నుంచి గ్రూపుల్లో మీటింగులు ముమ్మరంగా సాగిపోతున్నాయి. హాన్‌కి దడపట్టుకుంది. ఓరోజు నిద్రపట్టక బైట పచార్లుచేయసాగేడు. ఇంతలో బైట కుక్కల మొరుగుడు, అడుగుల చప్పుడు వినిపించింది. హాన్ కుక్కలు కూడా వంత పాడేయి. అడుగుల చప్పుడు దగ్గరయింది. హాన్ వెంటనే దక్షిణంవేపు దాక్కుని గేటువేపు చూసేడు. తలుపు తెరుచుకుని ఎవరో లోపలికి దూకేరు. నక్షత్ర కాంతిలో హాన్ వూని పోల్చుకున్నాడు. వెంటనే అతనిమీదికి వురికి చెయ్యిపుచ్చుకుని—

"దొంగ! దొంగ! లీ! తొందరగా రా!" అని అరిచేడు.

లీ కర్రపుచ్చుకుని వచ్చేడు. కుర్రాణ్ణి వుత్తరపు గదిలోకి ఈడ్చుకుపోయేరు. హాన్ కాంగ్‌మీద చతికిలబడి రొప్పుతూ

"ఎక్కడకు చచ్చేవురా?" అనడిగేడు.

"నీకనవసరం" తన ధైర్యానికి తనే ఆశ్చర్యపోయేడు వూ.

"నీకూ పొగరెక్కిందిరా!" లీకి కోపమొచ్చింది. తన కాలికింద కిక్కురుమన కుండా పడుండేవాడు. ఇప్పుడు తన యజమానినే ఎదిరిస్తాడా?

"ఆయనకి అనవసరమైతే, అది యీ కర్రకి అవసరంరా" అంటూ వెనక్కి తప్పుకుంటున్న కుర్రాడి వీపుమీద కర్రతో ఒక్కటేసేడు.

"ఆపు! గ్రూపు మీటింగులో ఏం జరిగిందో చెప్పనీ. చెప్పేక వదిలేద్దాం" అన్నాడు హాన్ కోపం అణచుకుంటూ.

"నన్ను చంపితే చంపు. నాను నీకు ఒక్కముక్కకూడా చెప్పను" అని తెలెగ రేసేడు వూ.

హాన్ ముఖం ఎర్రబడింది. మెడనరాలు కోపంతో వుబ్బేయి:

"ఏంరా, నీకూ ఎదురుతిరగాలనుందేటి? లీ, వీడి గుడ్డలూడదియ్యి. కొరడా తీసుకురా."

నేలక్కరుచుకున్న వూ గట్టిగా "రక్షించండి బాబూ, ఆరో నంబరు హాన్ నన్ను సంపేస్తుండాడు !" అని అరిచేడు.

లీ వెంటనే అతనినోట్లో గుడ్డలుగుక్కేడు. తెలతెలవారుతూంది. అంతానిశ్శబ్దం. హాన్ యింటిముందు కాపలా వున్నవాళ్ళకు వూ అరుపు వినిపించింది. ఒకడు హాన్ యింటివేపు పరుగెత్తేడు. మరోడు ఈల వూదుతూ రోడ్డుమీద

"హాన్ ఎవరినో సంపేస్తుండాడు !" అని కేకలు పెట్టేడు.

పందులుకాసే కుర్రాడు నేలమీద మొండిమొలతో పడివున్నాడు. హాన్ అతని వీపు కాలేసి నించున్నాడు. "మేక అయినా, మేకపిల్లయినా ఒకే తీరులో చంపాలి" అనుకున్నాడు హాన్.

"నిన్ను చచ్చేదాకా బాదుతారా !" అన్నాడు వూతో.

ఒకటి ! రెండు !! మూడు !!! కొరడా పైకీ కిందికీ ఆడుతూనే వుంది. వూ వీపంతా చీరుకుపోయి నెత్తురుధారలు. యజమానికితోడు అతని బంటు వూ తలమీద కర్రతో బాదసాగేడు. హాన్ తెల్లబట్టల మీదికి రక్తంచింది వూ కదలడంలేదు. అతను మూర్ఛపోయేడు.

హాన్ పళ్ళు పటపటలాడిస్తూ,

"త్వరగా పోయి గుర్రపు సాలలో గొయ్యితియ్యి. దొంగవెధవ. నాకే ఎదురు తిరుగుతాడూ ! వేలెడులేడు !!" అన్నాడు.

లీ గొయ్యి తవ్వేందుకు పరుగెత్తగానే, గేటుమీద ఎవరో బాదుతున్నట్టు వినిపించింది. ఇంతలో బైట చాలా మంది గుంపుకూడినట్టు మాటలు వినిపించేయి.

"హాన్‌బాబూ, పారిపో !" లీ అరుపు వినిపించింది. లీ పెరటివేపు పరుగెత్తేడు. అంతలో మనసు మార్చుకుని నిచ్చెన లాక్కొచ్చేడు. దాన్ని గోడకానించి, గోడమీది కెక్కేడు. ఆదరాబాదరా దూకేసరికి బైట గోతిలో పడినంతపనయింది. చెట్లలోంచి పరుగెత్తి ఓ కూరగాయల తోట చేరుకున్నాడు. బీరపాదులు, చిక్కుడుపాదులు కసపిస తొక్కుతూ మరో చెట్లగుబురుదాటి హొడుగుమెడ హాన్ యిల్లు చేరుకున్నాడు.

ఊరంతా సందడిగా వుంది. తూర్పు ఎర్రబడింది. కోళ్ళు కూసేయి. జనం హాన్ యింటికి అన్ని వైపుల నుంచీ పరుగెత్తేరు— రోడ్డుమీదనుంచి, పొలాల్లోంచి, కూరగాయల తోటల్లోంచి చేతి కేదిదొరికితే అది పుచ్చుకొచ్చేరు— గొడ్డళ్ళు, పారలు, గునపాలు, కర్రపేళ్ళు, జనపచువ్వలూ— ఆడామగా, పిల్లా పాపా, ముసలీ ముతకా— అంతా హాన్ యింటిముందు మూగేరు. అంతా కలిసి వెల్లువలా ముందుకురికేరు.

ఉప్పెనలా వాళ్ళు ముందుకు చొచ్చుకుపోతుంటే, సూర్యుడు వాళ్ళ వెన్నుతట్టుతున్నట్టు ఎండ వీపులమీద పడుతోంది. వాళ్ళ నున్నటితలలు, చింకిటోపీలు మెరిసిపోతున్నాయి.

అందరికన్నా ముందుపీటీన చావో, పాయి నిలబడ్డారు. వాళ్ళవెనక ప్రజాసైన్యం వుంది. అందరి చేతుల్లో కొత్త కొత్త యీటెలున్నాయి. హాన్ యింటి ముందున్న పెద్దగేటు ఎంతబాదినా తెరుచుకోలేదు. వెంటనే వాళ్ళు తూర్పువేపు గోడపైకి వురకబోయేరు. కాని అది ఇరవై అడుగుల ఎత్తుంది. ఎక్కడం కష్టం. అందుకని చావో తన తుపాకి పాయికిచ్చేసి, మరో సైనికుడితో కలిసి నిచ్చెనకోసం దగ్గర్లోవున్న ఇంటికి పరుగెత్తేడు.

నిచ్చెనెక్కి గోడ దూకేడు. నాలుగు కుక్కలు మొరుగుతూ అతనిమీద పడిపోయేయి. కాని రాతితో ఒక కుక్కని కొట్టాడోలేదో కుయ్యోమంటూ మిగతా మూడూ కూడా పారిపోయేయి. గోడ దూకినపుడు చావో కాలు కొంచెం బెణికింది. అయినా కుంటుకుంటూ వెళ్ళి గేటుగొళ్ళెం తీసేడు. వెంటనే సియావో, లియూ-షెంగ్, చిన్న వాంగ్, గార్డులతోసహా జనం ముందుకి తోసుకొచ్చేరు.

చావో పాయిదగ్గర్నుంచి తన తుపాకి తీసుకుని, బాయ్‌నెట్ ముందుకిపెట్టి ఇంటి చుట్టూవున్న కాళీ జాగాలోకి పరుగెత్తేడు. అతనివెనకే పాయి, కువో, సైన్యం. ఎర్ర రిబ్బన్లుకట్టిన బాయ్‌నెట్లు. ఈటెలు పొద్దుపొడుపు ఎండలో తళతళ మెరుస్తున్నాయి. ఉత్తరపు వేపుకి పాయి, గార్డులు వెళ్ళేరు. చావో, కువో తూర్పుభాగంలోకి దూసుకు వెళ్ళేరు. కాంగ్‌పక్కనే పడివున్న దేదో కాళ్ళకి తగిలింది. చావో ఒంగిచూస్తే వూ! ముట్టుకుంటే నెత్తురంటుకుంది– గోరువెచ్చగా. ఆ కుర్రాడు నెత్తురుమడుగులో పడివున్నాడు.

"ఇంకా బతికే వున్నాడు. కాంగ్‌మీదికెక్కిద్దాం, రా. పాయి, నువ్వెళ్ళి డాక్టర్ని తీసుకురా" అన్నాడు ఖంగారుగా చావో.

వూని పైకి లేపుతుంటే కువో, చావోల చేతులు రక్తంతో తడిసిపోయేయి. లోపలకొచ్చిన జనం నోటమాటలేకుండా నిలబడిపోయేరు.

జనంలోంచి సియావో "హంతకుణ్ణి పట్టుకోండి! పారిపోనివ్వకండి!" అని అరిచేడు.

దాంతో కువోకి, చావోకి వుద్రేకంకట్టలుతెంచుకుని జనాన్నితోసుకుంటూవెళ్ళేరు. మరికొందరు సైనికుల్ని తీసుకుని లోపలగదుల్లోకి వెళ్ళేరు. లోపల పిల్లలు, ఆడవాళ్ళు కాంగుమీద, మగవాళ్ళు బీరువాముందు కూచుని రైతుల్ని కసిగా చూస్తున్నారు.

"హాన్ ఎక్కడ ?" చావో గద్దించేడు.

"బైటికెళ్ళేరు" హాన్ భార్య ముక్తసరిగా చెప్పింది.

"తాళ్ళు తెచ్చేరా ?" అని సైనికుల్ని అడిగేడు చావో

"లేదు"

"ఎంటనే తెచ్చి ఈలని కట్టెయ్యండి"

చావో, కువో కలిసి గదంతా వెతికేరు. మనిషి దాగేచోట్లన్నీ వెతికేరు— తలుపుల చాటున, పెట్టెల లోపల. పెట్టెలనిండా బట్టలున్నాయి. కాని ఇప్పుడు వాళ్ళు అవన్నీ పట్టించుకునే స్థితిలో లేరు. ఎంత వెతికినా హాన్ జాడలేదు.

"నువ్విక్కడే వుండు" అన్నాడు చావో కువోతో. "ఈలసేత ఆడు ఏడకి పోయేడో సెప్పించు. సెప్పకపోతే ఆలని బాదు. పూచీ నాది. ఆపేపు ఎతికొస్తా" నని చావో వెళ్ళిపోయేడు.

సైనికులు తాళ్ళు తెచ్చేరు. కువో హాన్ భార్యని కట్టేసేడు.

"తమ్ముడూ, కనికరించు" అంటూ ఏడ్చింది.

"ఇక నీ జిత్తులు సాగవు" అన్నాడు కువో.

ఓ సైనికుడితో కలిసి హాన్‌భార్యని కట్టేసి, వుంపుడుకత్తె వైపు తిరిగేడు. ఆమె కిందబడి మూర్ఛపోయింది. మిగతావాళ్ళంతా "అయ్యో చచ్చిపోతోంది" అని అరిచేరు. ఆయి-చెంగ్ కంటతడి లేకుండా ఏడవసాగింది. కువో, మరో సైనికుడు బిత్తరపోయిచూస్తూ వుండిపోయేరు. ఇంతలో ఓల్డ్‌సన్ వచ్చేడు. అతనికి అంతా అర్థమైంది.

"లేవే, లే. నీ ఎత్తులు నాదగ్గరకాదు. లెగకపోతే బాదేస్తా, మరి కాస్కో. నువ్ సచ్చేదాకా కొట్టేనంటే, మీలో ఒకలు తగ్గుతారు. మీరంతా ఎనక్కి తప్పుకోండి, నా కర్ర తిప్పాల."

అతను కర్ర ఎత్తేలోపల ఆ వన్నెలాడి కళ్ళుతెరిచి, గభాల్న లేచి కూచుంది. ఓల్డ్‌సన్ ముందు మోకరిల్లి "నన్ను కొట్టకు, లేచేనుగా !" అంది.

"మరి అలా ఎత్తు ఎందుకేసేవ్, చెప్పు" అని అరిచేడు ఓల్డ్‌సన్.

"దానికి జబ్బు చేసింది. అదేం ఎత్తుకాదు" అంది హాన్‌భార్య.

"నిజంగానే చేసింది- అదోళ్ళ జబ్బు" అంది ఆయి-చెంగ్.

"సంపేత్తా"నని యీసారి నిజంగానే కర్రఎత్తేడు ఓల్డ్‌సన్.

"అయ్యో కొట్టకు, చెప్తాను బాబూ" అని ఏడుస్తూ, రెండుచేతుల్తో ముఖం కప్పుకుంది వుంపుడుకత్తె.

"నన్ను 'బాబూ' అని పిలమాక. నువ్వలా పిలిస్తే నాకు చిరాకు. ఊఁ బేగి సెప్పు" కర్ర పారేసేడు ఓల్డ్‌సన్.

"మందు ఎక్కువ తీసుకున్నా"

"అలా సెప్పు. నాకిప్పుడు యాటయ్యేల్లు. నానీ సుట్టుపక్కల బాగా తిరిగేను. నాకు నీ ఎత్తులన్నీ ఎరికనేదనుకున్నావా?" అన్నాడు ఓల్డ్‌సన్ నవ్వుకుంటూ.

"ఆరోనంబరు హాన్ ఎక్కడ? బేగిసెప్పు" అన్నాడు కువో.

"నాకు నిజంగా తెలీదు" ఎంతో జాలిగా ముఖంపెట్టింది.

బైట గదిలో చాలామంది మూగేరు. సియావో చిన్నవాంగ్‌ని డాక్టర్ కోసం పంపేడు గాని అతనింకా రాలేదు. వూ బోర్లాపడుకున్నాడు. అతని వీపుమీద నీలంగా, ఎర్రగా చారికలున్నాయి. అతని చేతులు, కాళ్ళు, తల కత్తితో కోసినట్టున్నాయి. అతని గాయాలనించీ యింకా రక్తం కారుతూనేవుంది. తీన్‌తాత ముందుకొచ్చేడు. వూని చూడగానే అతని ఏడుపు ఆగలేదు. ఇంతకు ముందు హాన్‌బారినపడ్డ అతని కూతురు గుర్తొచ్చింది. ఇప్పుడు తన ఎదురుగావున్నది తనబిడ్డేననిపించింది. వెంటనే చింకిచొక్కా విప్పి వూ మీద కప్పబోయేడు. సియావో అతన్ని ఆపేడు:

"ఆగు. తీన్‌తాతా. అందర్నీ చూడనీ"

చిన్నవాంగ్ వచ్చేడు. గాయాలకి జాగ్రత్తగా మందుపూసి కట్లు కట్టేడు.

హాన్ పారిపోయిన సంగతి సియావోకి చావో రొప్పుతూ చెప్పేడు. సియావో అది విని అదిరిపడ్డాడు. కాని ఒక్కక్షణం ఆలోచించి తాపీగా,

"ఫర్వాలేదు. ఎంతోదూరం వెళ్ళివుండడు. అన్నివైపులకి వెళ్ళి వెతకండి" అన్నాడు.

సియావో బైటకొచ్చి గార్డులని, సైనికులని, ఆక్టివిస్టులని అయిదు గ్రూపులు చేసేడు. వాళ్ళు వెంటనే నౌకర్ల గదుల్లోనూ, గాదెల్లోనూ, సామాను గదిలోనూ, గుర్రపుసాలలోనూ, పందుల సాలలోనూ ప్రతి మూలా వెదికేరు. కాని హాన్ ఎక్కడా కనిపించలేదు. దక్షిణంవేపు గోడకి నిచ్చెన ఆన్చివుంది. అయితే హాన్ గోడదూకి పారిపోయివుంటాడు।

సియావో వెంటనే గోడవతలికి వెళ్ళిచూసేడు. అక్కడ రెండు జతల జోళ్ళ ముద్రలున్నాయి— ఒకటి రబ్బరు జోళ్ళదీ, మరోటి గుడ్డలతో అల్లిన జోళ్ళదీను. ఆ ముద్రల్ని యింకొంచెం దూరం వెంటాడితే రబ్బరుజోళ్ళు వుత్తరపువేపూ, గుడ్డల జోళ్ళు దక్షిణపువేపూ మళ్ళేయి. సియావో కొంచెంసేపు ఆలోచించి చావో, వాన్‌లతో వుత్తరపువేపు నడిచేడు.

"వెళ్ళి మూడు గుర్రాలు తీసుకురా" వాన్‌కి పురమాయించేడు.

"చావో! నువ్వు జీనులేకుండా గుర్రపు స్వారి చెయ్యగలవా?"

"ఓ, చెయ్యగలను"

"సరే, అయితే జీనువెయ్యక్కర్లేదు. తొందరగా రా వాన్" అన్నాడు సియావో.

ఇంతలో పాయి వీళ్ళదగ్గరికి వచ్చేడు.

"పాయి, నువ్వు దక్షిణానికీ, కువో తూర్పుకీ, పెద్దలీ పడమరకీ వెళ్ళండి. మీతోపాటు గార్డులని తీసుకువెళ్ళండి. గుర్రాలమీద వెళ్ళండి. ఇవి నా ఆదేశాలని చెప్పు వాళ్ళకి. హాన్‌ని ఎలాగైనా పట్టుకోవాలి" అన్నాడు సియావో.

జేబులోవున్న చిన్న పుస్తకంలోంచి కాయితం చింపి, పెన్సిలుతో

"సెక్షన్ లీడర్ చాంగ్! హాన్‌ని పట్టేందుకు గార్డులని ఆయుధాలిచ్చి కువో, పాయి, పెద్దలీలతో తూర్పు, పడమర, దక్షిణం వేపులకి పంపండి. మీరు ఇద్దరు గార్డులనుంచుకుని వూళ్ళోనే చాంగ్, సైనికులతోపాటు కాపలా వుండండి. హంతకుడి కోసం చూస్తూనే వుండండి."

— సియావో

అని రాసేడు.

సియావో నవ్వుతూ "చావో, ఇప్పుడు నీ గురి చూపించాలి. ఎప్పుడైనా తుపాకి కాల్చేవా?"

"కాల్చినాను బాబూ. దెబ్బ సూటిగానే కొట్టగలను."

"మంచిది. పారిపోవటానికి ప్రయత్నిస్తే, వాణ్ణి కాల్చిపారెయ్యి."

ఇంతలో వాన్ తనెక్కిన గుర్రంకాక మరో రెండు గుర్రాలు తీసుకొస్తూ కని పించేడు. సియావో అతన్ని వేగం పెంచమని అరిచేడు.

వాన్ గుర్రాల్ని దౌడు తీయించేడు. రోడ్డుపక్కన బాతులు భయంతో అరుస్తూ, రెక్కలు టపటప కొట్టుకుంటూ పక్కకి పారిపోయేయి. పందులు, మేకలు కంచె చాటునుండి చూసేయి. మూడు గుర్రాలూ భూమ్మీద ఆనకుండా పరిగెత్తేయి. అయినా సియావో "ఇంకా త్వరగా! ఇంకా తొందరగా!" అని అరుస్తూనేవున్నాడు.

మరునిమిషంలో సియావో, చావోల్ని చేరుకున్నాడు వాన్. వాళ్ళు వెంటనే గుర్రాలెక్కి వాటిని దౌడు తీయించేరు.

"వాన్, నీ తుపాకి తియ్యి. జోళ్ళగుర్తులుచూస్తూ అటువైపే వెళ్ళు" అన్నాడు సియావో.

వాళ్ళు వుత్తరానవున్న గేటుదాటి చెరువు చేరుకున్నారు. దారిపొడుగుతా అడుగు జాడలున్నాయి కాని వాళ్ళు వంతెనదాటగానే అడుగులు పక్కకిమళ్ళి, మాయమయేయి.

"ఇంక గుర్తులులేవు!" అన్నాడు సియావో.

"ఈడ గాలి లావుగున్నాది బాబూ. అడుగులమీద పట్టికొట్టుకు పోనాది" అన్నాడు చావో— దారంతా పైకీ కిందికీ చూస్తూ.

సియావో ఎండలో ఏటిఒడ్డంతా ఓసారి వెదికాడు. చెట్ల ఆకులు రాలుతున్నాయి; రెల్లుగడ్డి కొంత పచ్చగా. కొంత పసుపురంగుగా వుంది: మొక్కజొన్న బాగా పండి పోయింది.

"వాడు పొలాల్లో దాక్కుని వుండొచ్చు. జాగ్రత్తగా వుండాలి" అనుకున్నాడు సియావో. మిగతా యిద్దరిని కూడా హెచ్చరించేడు.

ఓచోట దారి రెండుగా చీలింది— వుత్తరానికీ, దక్షిణానికీ. ఉత్తరంగాపోతే భూసంస్కరణ కార్యకర్తల దళం వున్న మరో వూరుంది. హాన్ ఎటువేపు వెళ్ళి వుంటాడు? ఇక అడుగుల జాడకూడాలేదు. ఎటు వెళ్ళాలో ఎవరికీ తోచలేదు. "మరోదళం వున్నవూరు వాడు వెళ్ళడు" అనుకున్నాడు సియావో.

అందుకని మళ్ళీ నది ఒడ్డునే బయల్దేరేరు, ఆ తేటనీటిలో వాళ్ళ నీడలు, గుర్రాల నీడలు కనిపిస్తున్నాయి. ఏటి ఒడ్డునే ఓ జాలరి చుట్ట తాగుతూ కనిపించేడు. అతను నీటిలో వల పన్నేడు. వీళ్ళని చూడగానే పలకరించేడు:

"చైర్మన్ చావో, ఏడకి పోతున్నా?" అని.

అతనూ రైతుసంఘ సభ్యుడే. అందుకని చావో వెంటనే గుర్రం దిగి,

"ఇంతకుముందు హాన్ యిటుగాని వెళ్ళేడా?" అన్నాడు.

"నేదు బాబూ" అంటూ ఆ జాలరి చావోని దగ్గరకి పిల్చి "ఎంత పెద్ద సేప పట్టేనో సూడుమీ!" అన్నాడు.

చావో తన గుర్రపు కళ్ళేలు వాన్‌కి అందించి జాలరి 'చూ' దగ్గరికి వెళ్ళేడు.

"అల్లక్కడ సేపలుపెట్టే గుడిసెవున్నది కాదా, అక్కడ గడ్డి కింద సూడు" అని నెమ్మదిగా చెప్పేడు జాలరి 'చూ'.

చావో తుపాకి గురిపెట్టి దగ్గర్లోనేవున్న గుడిసెవేపు నెమ్మదిగానడిచేడు. గబాల్న పాకలోకి దూరి, తుపాకితో గడ్డి అటూ ఇటూ లాగేడు. చెమ్మగావున్న ఎండు గడ్డి లోంచి బట్టతల కనిపించింది. ఆ తల మళ్ళీ దాక్కోడానికి ప్రయత్నించింది. ఎలా

గ్గి తేనేం. తప్పించుకున్నా ననుకున్న శత్రువు దొరికేడు. చావో కోపంతో వూగిపో యేడు. తుపాకి వెనక్కి తిప్పి, హాన్ చేతిమీద ఒక్కటేసేడు.

"ఏట్రా, ఎక్కడికి పోదాంవనుకున్నావ్? ఆకాసం మీదికి ఎగురుదాంవను కున్నావేటి?"

సియావో, వాన్‌కూడా తలలుపంచి పాకలోకి దూరేరు. మూలనున్న తాడుతో హాన్ చేతులు కాళ్ళు కట్టేసి, వాన్ నల్లగుర్రంమీద పడేసేరు. అతన్ని గుర్రానికికట్టి మెల్లగా వూరువేపు నడిచేరు.

"నానూ ఒస్తానుబాబూ" అంటూ జాలరి చూ వలచుట్టేసి, చేపలన్నీ రెండు బుట్ట ల్లోకి ఎత్తేడు. ఆ బుట్టలు రెండూ భుజానున్న కావిడికి ఎత్తుకుని వాళ్ళతో కలిసేడు.

"ఇది శానా పెద్దసేప కదా! కాని దీన్ని జాగర్తగా కనిపెట్టుండాల. పెద్ద ఇదిగా కరుస్తాది" అన్నాడు నవ్వుతూ.

ఓ పది రూపాయల నోటు చూపించి "ఇది సూడండి బాబూ. ఇందాక ఈడు నాకాడికి పారొచ్చి పాకలో దాగుంతానని పైసలిచ్చి, ఎవరితోనూ సొప్పద్దన్నాడు" అన్నాడు.

"మరైతే నువ్వు మాకెందుకు సెప్పేవు" అనడిగేడు సియావో.

"అదేటిబాబూ, నాను సంగపోన్నికానా? బుగతని అంత సులాగ్గా వొగ్గుతానా? ఆడు ఇటు రాంవడంవే బాగైంది."

"ఎటుపోయినా యీడిని పట్టేసేటోల్లం" అన్నాడు చావో.

ఇంతలో చిన్నవాంగ్, లియూ-షెంగ్‌లు ముందురాగా వాళ్ళ వెనకే ఈటెలు పుచ్చుకుని కొంతమంది వచ్చేరు. సియావోకి బందిపోటోళ్ళుగాని తగులుతారేమో. రక్షణకని జనం ముందుకొచ్చేరు.

గుర్రంమీద హాన్‌ని చూడగానే అంతా అతని చుట్టూచేరి కర్రలూ, యీటెలూ పైకెత్తేరు. కాని చావో వాళ్ళని ఆపి,

"ఆగండి. వూళ్లోకి తీసుకుపోయి యీడిని అందరి ముందు నించోపెడదాం. ఈడు పెట్టిన బాధలు అందర్నీ సెప్పుకోనివ్వాల."

కాని వెర్రి ఆవేశంలోవున్న రైతులు ఆగలేదు. గుర్రాల్ని కదలనీకుండా దారి అడ్డేసేరు.

చావో, సియావో, చిన్నవాంగ్, లియూ-షెంగ్‌లు కలిసి హాన్‌ని వూళ్ళోకి తీసుకెళ్ళాలని తీర్మానించేరు.

చావో గుర్రమెక్కి అందరికీ వినిపించేలా "తప్పుకోండి బాబూ. ఈడిని వూళ్లోకి తీసుకుపోయి మీటింగెట్టాల. ఇక్కడ అందరు నేరుకదా! ఈడు మన వూళ్లో అందరికీ రాచ్చసుడే. మరి అందరూ ఈడ్ని సూడాలగదా? మనకెంత కసి వున్నదో అల్లకీ అంత కసివున్నాది. మరి తప్పుకోండి బాబూ. ఊళ్ళో పెద్ద మీటింగుంటాది" అని అరిచేడు.

"ఆడు మల్లా తప్పిచ్చుకుంటేనో?"

"ఈమారు తప్పిచ్చుకోమను, సూద్దాం" అన్నాడు చావో.

అప్పటికి తప్పుకున్నారు జనం. కాని హాన్ గుర్రం వెళ్తుంటే ఒక్కొక్క దెబ్బ పడుతూనే వుంది.

కువో, పెద్దలీ, పాయిలతోపాటు వెదికేందుకు వెళ్ళినవాళ్ళు సాయంత్రానికల్లా ఎంతో నిరాశగా తిరిగొచ్చేరు. కాని హాన్ దొరికిపోయేడని తెలియగానే ఎగిరి గంతేసేరు. వాళ్ళు వెంటనే స్కూలుముందున్న ఖాళీ జాగాలోవున్న హాన్‌దగ్గరకు వెళ్ళి కొట్టబోయేరు. కాని వాళ్ళని సియావో ఆపేడు.

"ఏరా, మమ్మల్ని తిప్పిస్తావురా?" అని తిట్టేరు.

హాన్‌ని ఓ కొట్లోపెట్టి తాళంవేసేరు. ఇరవైమంది ఆ కొట్టుచుట్టూ రాత్రీ, పగలూ కాపలా వుండేందుకొప్పుకున్నారు.

ఊళ్ళోకి రాగానే సియావో వూ ఎలాగున్నాడని అడిగేడు.

"అతను జిల్లా ఆస్పత్రిలో వున్నాడ"ని చిన్నవాంగ్ చెప్పేడు.

రైతు సంఘం తీర్మానం ప్రకారం సియావో హాన్ యింటిల్లపాదినీ అరెస్టు చేసేడు. సైనికులు అతని ఆస్తికీ, సొమ్ములకీ కాపలావున్నారు. పెట్టెలకీ, బీరువాలకీ రైతు సంఘం సీళ్ళు వేసింది. వూ చెప్పిన ప్రకారం పెరట్లోను, కట్టెల కింద దాచిన సామాను దొరికింది. హాన్ పైవూళ్ళకి తరలించిన సామాను ఆచూకీ కూడా తెల్సింది.

కొద్దిరోజుల తర్వాత 'తెల్లమేక' సుంగారీ నదికి దక్షిణంగా పారిపోయేడు. పొడుగుమెడ హాన్, లీ చింగ్-షాన్ బందిపోట్లలో కల్సిపోయేరు. అంత ఆనందం లోనూ యీ సంగతే కొంచెం నిరుత్సాహ పర్చింది.

(ఇంకా వున్నది)

# విప్లవ రచయితల సంఘం తీర్మానాలు

(వరంగల్ అక్టోబర్ 7)

❶ **విప్లవ సాహిత్యంపై ప్రభుత్వ ఇనుపపాదం:** ఈ దేశంలోని పాలక వర్గం రాజ్యాంగరీత్యా తానే ఇచ్చిన అభివ్యక్తి స్వేచ్ఛను కాలరాస్తూ సాంస్కృతికంగా కూడా తన దోపిడి స్వభావాన్ని నగ్నంచేసుకుంటున్నది. ఇంతవరకు విరసం ప్రచురించిన సాహిత్యాన్నీ, ఇప్పుడు విరసం అభిమానులు ప్రచురించిన పుస్తకాలనూ, పత్రికలనూ నిషేధిస్తూవుంది. ఇటీవల వరసగా శంఖారావం, నెత్తుటిదీపం, బందూక్ (కవితా సంకలనాలు), సృజన (మే 72 మార్చ్/ఏప్రిల్ '73 సంచికలు), పిలుపు(నవంబరు 72 సంచిక) లను తన 'రాజపత్రా'ల (జీ వో.) ద్వారా నిషేధించింది. కాని తన గజెట్‌లో మాత్రం ప్రకటించడంలేదు. విరసంకు గాని, **ఆయా** సంపాదకులకు గాని ఈ నిషేధం గురించి తెలియ జేయాలనే తన చట్టబద్ధమైన మర్యాదలను అతిక్రమించి ప్రాథమిక హక్కులను మింగివేస్తున్నది. ఈ బూర్జువా ఏకపక్ష నియంతృత్వపు పాలనా విధానాన్ని విరసం తీవ్రంగా ఖండిస్తున్నది.

❷ **పంచాది వారసుడు రాజారాంరెడ్డికి విప్లవజోహార్లు:** బూర్జువా చదువుల డొల్లతనాన్నీ, కుట్రనూ తేటతెల్లం చేసిన చారుమజుందార్ విప్లవ పంథాను అవగాహన చేసుకున్న వేనవేల విద్యార్థుల్లో ఆదిలోనే ఆచరణలో పెట్టినవాడు పంచాది కృష్ణమూర్తి. తెలంగాణలో బత్తుల, నెల్లూరి సీమలో రాజారాంరెడ్డి ఆ విప్లవ వారసత్వాన్ని నిలిపినవారు. నెల్లూరు జిల్లాలో పుట్టి, అనంతపురం ఇంజనీరింగ్ కాలేజీలో చదువుతూ పెట్టుబడిదారీ నిర్మాణం కొరకుగాక, శ్రామికరాజ్య నిర్మాణం కొరకు తన చదువు సార్థకం కావాలని గ్రహించి శ్రీకాకుళ గిరిజన రైతాంగ పోరాటంలో దూకినవాడు రాజారాంరెడ్డి. 24 సంవత్సరాల చిన్న వయసులోనే మార్క్సిస్టు-లెనినిస్టు పార్టీ శ్రీకాకుళం రీజనల్ కమిటీ కార్యదర్శియై పోరాటంలో ప్రాణాలొడ్డిన అమరుడు రాజారాం. పోలీసులు అతన్ని పట్టుకొని రోజులతరబడి చిత్రహింసలు చేసి కనుగుడ్లుపీకి చంపేశారు. ప్రజల కొరకు ప్రాణాలొడ్డిన రాజారాముడు నిజమయిన ప్రజారాముడు.

విప్లవ రచయితల సంఘం ఆయనకు జోహార్లు అర్పిస్తూ విద్యార్థిలోకం ఆయన నుంచి ఆయుధాన్నీ, ఆదర్శాన్నీ స్వీకరించే విప్లవదీక్ష గైకొనాలని విజ్ఞప్తి చేస్తున్నది.

❸ **చిలీ దురంతం:** ఓట్లు పెట్టెద్వారా సోషలిస్టు విప్లవాన్నీ, సంస్కరణల ద్వారా సోషలిజాన్నీ సాధించ బూనిన అల్లెండే పాపులర్ ఫ్రంట్ ప్రభుత్వం చివరకు

ఫాసిస్టుశక్తుల విజృంభణవల్ల దురంతం పాలైంది. డాలర్ సామ్రాజ్యవాదులూ, చిలీ జాతీయ బూర్జువావర్గమూ కలిసి చేసిన కుట్రలు, అల్లెండే హత్యతో, ప్రభుత్వ పతనంతో, సైనిక నియంతృత్వ స్థాపనతో చిలీని కొన్ని దశాబ్దాల వెనక్కు తోసివేశాయి. "సోషలిజానికి చిలీ మార్గం" అని పేరుపొందిన పార్లమెంటరిజం దారుణ ఫలితాల నిచ్చింది. అర్ధవలస దేశాలలో జాతీయవిమోచనం దీర్ఘకాలిక సాయుధ ప్రజాపోరాటం ద్వారానే జనతా ప్రజాతంత్ర విప్లవాన్ని సాధించుకోగలదని రుజువైంది. సాయుధులైన ప్రజల వర్గచైతన్యం ఒక్కటే సోషలిస్టు విజయాలను బహిరంతర ప్రమాదాల నుండి పరిరక్షించ గలదనే విషయం కూడా రుజువైంది. లాటిన్ అమెరికా, ఆఫ్రికా, ఏసియా దేశాలకు మావో ఆలోచనా విధానమే సరియైన మార్గమని చిలీ అనుభవం ప్రపంచానికి నేర్పుతూంది. చిలీలో సాగుతున్న సాయుధ ప్రతిఘటన వామపక్ష విప్లవోద్యమం నాయకత్వాన ఆ దేశపు కార్మిక కర్షక వర్గాలకు నిజమైన ప్రతినిధి అని చాటక చాటుతూంది. కమ్యూనిజం ప్రపంచ శక్తి అని, దానిపురోగతిని ఏ బాంబులూ, బందూకులూ ఆపజాలవనీ చిలీ సైనిక నియంతలూ, అమెరికన్ సామ్రాజ్యవాదులూ త్వరలో నేర్చుకోవలసి వస్తుంది.

చిలీ కార్మికోద్యమానికి తన కవిత్వం ద్వారా ప్రపంచవ్యాప్తమైన గుర్తింపు కలిగించిన పేబ్లో నెరూడా, అల్లెండే లాగానే సంస్కరణవాదాన్ని బలపరిచి రివిజనిజాన్ని అనుసరించినప్పటికీ చిలీ శ్రామికజన సంస్కృతికి మేటి ప్రతినిధికాబట్టి తన మాతృదేశం కత్తులబోనై పోయిన సమయంలో మరణించి గొప్ప లోటు కలిగించాడు.

విప్లవ రచయితల సంఘం అల్లెండే, నెరూడాల మృతిపట్ల తన విచారం ప్రకటిస్తూ, విప్లవ వామపక్ష సాయుధ చర్యలను అభినందిస్తూంది.

❹ వరంగల్‌లో విరసం సభ్యులపై ప్రగతిశీల ప్రజాస్వామ్య విద్యార్థులపై లాఠీచార్జ్: దేశాన్ని పట్టపగలు దోచుకుంటున్న చీకటిబజార్లు సృష్టించిన కాంగ్రెస్, ఆహారధాన్యాలు సామాన్యునికి కార్డుమీదనేకాదు, కలలోకూడా దొరకకుండా చేసిన కాంగ్రెస్, ప్రజలను చావుబతుకులమధ్య నిత్యమూచస్తున్న శవాకారాలుగా మారుస్తున్న కాంగ్రెస్, సామాన్యుని జవసత్వాలన్నీ నీళ్ళకోసం, గ్యాస్‌నూనెకోసం, బియ్యం కోసం హనుమంతుని తోకలాంటి క్యూలలో హరమారుస్తున్న కాంగ్రెస్, సామాన్యుని వెన్నెముకమీద దోపిడీ పర్వతాన్ని మోపి నినాదాలగడ్డిగరిపిస్తున్న కాంగ్రెస్— అధిక ధరలకు వ్యతిరేకంగా ప్రజలుతీసిన ఊరేగింపులో విచ్ఛిన్నంచేయడానికే చేరింది. కాకపోతే ఏ జండా ఈ దేశంలో 25 ఏళ్ళ రక్తపాతానికి, మానభంగాలకు, దోపిడీకి, కన్నీళ్ళకు కారణమో ఆ జండా కార్మికులపక్షం వహిస్తుందంటే నమ్మేవాళ్ళు రివిజనిస్టులైతే

కావచ్చు కాని ప్రజలుకారు. ఎర్రజెండాలను కాంగ్రెస్‌జెండా పాదాలదగ్గర దాసోహమన్న రివిజనిస్టులు, లెనిన్ పతకాన్ని ఖద్దర్ గద్దరితనంముందర చేతులు నలుపుతూ అమ్ముకున్న రివిజనిస్టులు పాలకవర్గం కావలికుక్కలపాత్ర నిర్వహిస్తున్నారు. దేశంలో కుళ్ళు అంతా కాలిపోయినట్లు, దోపిడీగుట్టలు భస్మీపటలమైపోయినట్లు కాంగ్రెస్‌జెండాలు కాలిపోతుంటే యీ ఖద్దర్‌గుండాల పోలీస్ యూనిఫారంలోవున్న గుండాల గుండెలు పిరికితనంలో గజగజలాడాయి. అసహ్యాకరమైన పిరికితనం అసహాయులైన ప్రజల మీద పాశవిక దమనకాండకు పూనుకుంటుంది. ఇది 24 ఆగస్టురోజు వరంగల్‌లో జరిగిందిమాత్రమేకాదు. చరిత్రనిండా యీ ఫాసిస్టుల దమనకాండ నెత్తురుమరకలు చెరిగిపోకుండావున్నవి. కాని యీ హింసాకాండను యీ ఫాసిస్టుల పాలనను గుండె నెత్తురు ధారవోస్తూ బూడిదలా కాళ్ళతో తోసేస్తూ ప్రజాసైన్యం కదలివస్తోంది. రేపు యీ గడ్డమీద నడచివచ్చే ప్రజాసైన్యం కవాతులకు యీ కార్మికుల విద్యార్థుల ఊరేగింపులే పాఠశాలలు.

ఢిల్లీ ఫాసిస్టు పరిపాలన నగ్నరూపం ఖద్దర్‌గుండాలు ప్రయోగించిన అహింసా జండాకర్రల్లో పోలీస్‌గుండాలు ప్రయోగించిన లాఠీల్లో బట్టబయలైంది. హింస విచ్చలవిడిగా రాజ్యంచేసినచోట ప్రతిఘటన అనివార్యం అవుతుంది. నక్సల్‌బరీ శ్రీకాకుళం వీరతెలంగాణ ములుగుపోరాటాల ప్రభావం విద్యార్థుల కార్మికుల ఉద్యోగుల మేధావుల సంఘటిత మిలిటెంట్ ఊరేగింపులో వ్యక్తమైంది.

విద్యార్థి రవీందర్ తలలోంచి చిందినరక్తం, భుజంగరావు భుజంమీద నెత్తురు పువ్వులవలె బొప్పిగట్టినగాయాలు, విరసం సభ్యులైన రంగారావు, వరవరరావులపై ఏరి ఏరి పోలీసులు ప్రయోగించిన లాఠీలూ పోరాటపాఠాలే నేర్పుతాయితప్ప, పోలీసు రాజ్యంపట్ల అసహ్యాన్ని పెంచుతాయేతప్ప ప్రజల అచంచలమైన, సాహసోపేతమైన పోరాటశక్తిని అణచలేవు. కార్మికులశక్తి అజేయమైంది. విద్యార్థులశక్తి వీరోచితమైంది. విప్లవం జయించితీరుతుంది.

1. పోలీస్ జులుం నశించాలి. 2. కాంగ్రెస్ రివిజనిస్టు మిలాఖత్ దోపిడీవర్గం కుట్రకు సుబూత్. 3. కార్మిక, కర్షక, ఉద్యోగి, విద్యార్థి రచయితల సంఘటితశక్తి వర్ధిల్లాలి. 4. విప్లవం వర్ధిల్లాలి.

త్రిపురనేని మధుసూదనరావు
కార్యదర్శి
విప్లవ రచయితల సంఘం, ఆంధ్రప్రదేశ్.

## ఖమ్మం చారుమజుందార్ బుక్‌స్టాల్‌పై పోలీసుల దాడి

ఖమ్మం చారుమజుందార్ బుక్‌స్టాల్ పై పుస్తకాలపై 10-10-73 పట్టపగలు 2 గంటలకు సి. ఐ. డి. పోలీసుల దాడి. ఖమ్మం యస్. ఐ. వచ్చి పుస్తకాలు అమ్మే బి. వీరయ్య ఎవరురా అని అడిగినాడు. ఇక్కడ కొంతమంది పుస్తకాలు చదువుతు వుంటె వారిని కొట్టాడు ఒరేయ్ వీరయ్య అని పుస్తకాలు క్రిందకు లాగి, 'బందూక్' పుస్తకాలు తీసుకున్నాడు. మరియు పుస్తకాలను అమ్ముతావటరా అని పుస్తకాలు క్రిందకు లాగి, కాళ్లతో తన్నాడు. నేను వాటిని తీయబోతే వాటిని తియ్యకురా అని అలాగే వుంచాడు. సి. ఐ. డి. ఆఫీసర్లు మొత్తం చెకింగ్‌చేసి ఇంకేమైనా పుస్తకాలు వున్నాయా అని అడిగినారు. ఇంతలో బయట జనం గుమికూడగా వారిని పోలీసులు తరిమారు. పిల్లలు ఆడుకొనే క్యారంబోర్డు తీసుకవెళ్లి పోలీసు వ్యానులో పెట్టినారు. 'బందూక్' పుస్తకాలు తీసుకోని బయటనుంచి ఏమితెలియనివాళ్లని పిలిచి సాక్షులుగా తీసుకున్నారు. మేము వేరే మనుషులను సాక్షులుగా తీసుకవస్తే వారిని నిరాకరించారు. చారు మజుందార్ బుక్‌స్టాల్ పేరుతో విప్లవ రచయితల పుస్తకాలు అమ్ముతావురా అని బెదిరించారు. నేను కమ్యూనిస్టు భావాలు కలవాడిని కనుక అవి అమ్ముతున్నాను అని చెప్పినాను. నీకు ఎంతమంది పిల్లలురా అని అడిగినారు. నాకు ఎనిమిది మంది పిల్లలు అని చెప్పినాను. తరువాత క్యారంబోర్డు తీసుకవచ్చి యిచ్చినారు.

బి. వీరయ్య
చారుమజుందార్ బుక్‌స్టాల్, ఖమ్మం.

---

## చైనా పునర్నిర్మాణం

ఒక వుదయం అయిదుగురు పిల్లలున్న ఓ యింట్లోకి వొక మధ్య వయస్కుడు వచ్చాడు. వస్తూనే పొదిగూడా కిందపెట్టకుండానే చాలా వెచ్చగా 'నేనో మంగలిని. మీకే సాయమూ చేయలేకపోయినా కనీసం వెంట్రుకలు కత్తిరిస్తాను' అన్నాడు. వెంట్రుకలు కత్తిరిస్తూ తన గత జీవితం గురించి అనాధగా తన భార్య గడిపిన బాధాకరమైన జీవితం గురించి చెప్పాడు. గత సమాజంకి సంబంధించిన క్రౌర్యాన్ని మర్చిపోవద్దని పిల్లలకు చెప్పాడు. చాలా శ్రద్ధగా చదువుకొని చైర్మన్ మావో మంచి పిల్లలుగా మారమని ప్రోత్సహించాడు. పోతూపోతూ పిల్లలను మెత్తగా స్పృశిస్తూ 'వసంతంలో మళ్ళీ వస్తాను. నా కొరకు నమ్మకంగా ఎదిరి చూడండి' అన్నాడు.

---

## నక్సలైట్లను, ఇతర విప్లవకారులను 'సంఘర్షణ' (ఎన్‌కౌంటర్) ల పేరుతో చల్లగా గొంతులు కోస్తున్న పోలీసుల నేరాలపై

# న్యాయ విచారణ కోసం డిమాండ్

**1** ఈ బూటకపు ప్రజాస్వామ్య వ్యవస్థలో దినదినమూ తన ప్రాథమికహక్కులు కాలరాయబడుతున్న వాస్తవాన్నిగురించి యీ దేశంలోని ప్రతి చైతన్యవంతుడైన పౌరుడు క్రమంగా ఆలోచిస్తున్నాడు. ప్రజా విప్లవ పోరాటాలను రక్తపాతంలోముంచే ప్రయత్నంతోనే రాష్ట్ర ప్రభుత్వం వేలాది దేశభక్తులను భారత రక్షణచట్టం (డిఫెన్స్ ఆఫ్ ఇండియారూల్స్) ఆంతరంగిక భద్రతాచట్టం (మేంటెనెన్స్ ఆఫ్ ఇంటర్నల్ సెక్యూరిటీ యాక్ట్) కింద జైళ్ళలో నిర్బంధిస్తున్నది. నక్సలైట్లను, విప్లవకారులను చల్లగా కుత్తుకలుకోసి నెత్తురుమడుగుల్లో ముంచుతూ రాష్ట్ర ప్రభుత్వ యంత్రాంగం నిర్బంధ సాధనంగా నగ్నంగా బయటపడుతున్నది. దోపిడీకి గురియైన ప్రజల విముక్తి కోసం అంకితమైన ప్రజానాయకులను, సంఘర్షణల (ఎన్‌కౌంటర్స్) పేరుతో పట్టుకొని హత్యచేస్తున్నది.

**2** ఈ నాయకులు ఎన్‌కౌంటర్‌లో చచ్చారని ప్రభుత్వం అంటున్నది. ప్రజలకిది బూకరింపు అని తెలుసు. ఎన్‌కౌంటర్‌లగురించి పోలీసులు అల్లిన కట్టుకథలన్నీ రాష్ట్ర ప్రభుత్వమే ప్రకటించిన డాక్యుమెంట్ల (పార్వతీపురం 'కుట్ర'కేసు, ఇతర 'కుట్ర' కేసులకు సంబంధించినవి)తో బట్టబయలయినవి. ఈ ఎన్‌కౌంటర్‌లగురించి పోలీసుల కథనానికి సంబంధించిన పసందైన అంశమేమంటే నక్సలైట్లు లేదా విప్లవకారులు కాల్పులుజరిపితే ఆత్మరక్షణకోసం పోలీసులు వాళ్ళ ఆయుధాలు ఉపయోగించారు అన్నది. కాని యీ 'ఎన్‌కౌంటర్‌ల'లో ఎంతోమంది నక్సలైట్లు, విప్లవకారులు చంపబడుతుండగా, ఒక్క పోలీసుఅయినా చావకుండా, గాయపడకుండా ఎట్లా బయటపడుతున్నాడన్నదే ఒక్కరికీ అంతుపట్టని ఆశ్చర్యంగావున్నది. ఈ పోలీసు కథనం పైరు ధ్యాలపుట్టగా, హేతువుకు, వివేకానికి వ్యతిరేకంగావున్నది.

**3** ఇప్పటికి 90 మందికిపైగా నక్సలైట్లు విప్లకారులు చంపబడ్డారుకాని ఒక్క పోలీసుఅయినా కనీసం కొంచెమైనా గాయపడలేదు. నక్సలైట్లను, విప్లవకారులను పాశవికంగా హత్యచేస్తున్న ఫాసిస్టు ప్రభుత్వ విధానాలను ఇది స్పష్టంగా బట్టబయలు చేస్తున్నది.

ఆంధ్రప్రదేశ్‌లో, మార్క్సిస్ట్-లెనినిస్ట్‌పార్టీ నాయకులైన పంచాది కృష్ణమూర్తి నిర్మల, డాక్టర్ భాస్కరరావు, మల్లికార్జునుడు, పాణిగ్రాహి సుబ్బారావు, వెంపటాపు

సత్యం, ఆదిభట్ల కైలాసం ఇంకా ఎందరో ఇలాంటి నమ్మింపచూసే 'ఎన్‌కౌంటర్'లలోనే చనిపోయారని చెప్పబడుతున్నది. 4-8-78 రోజు మార్క్సిస్ట్-లెనినిస్ట్‌పార్టీ నాయకులైన అప్పలస్వామి, అరికె సోములు ఎన్‌కౌంటర్‌లో చనిపోయినట్టు రిపోర్టుచేయబడింది.

**4** ఎన్‌కౌంటర్‌లలో చనిపోయినారనిచెప్పబడుతున్న మార్క్సిస్ట్-లెనినిస్ట్‌పార్టీ నాయకుల, విప్లవకారులజాబితా కింద ఇవ్వబడింది.

పౌరహక్కులను కాపాడుకోవాలనే ఆసక్తి వున్న ప్రజాస్వామిక దృక్పథంగల వ్యక్తులు, సంస్థలు తమ గొంతు బలంగావిప్పి ప్రభుత్వంచేస్తున్న దమనకాండను, గ్రామీణప్రాంతాల్లో పోలీసులు విచ్చలవిడిగా సృష్టిస్తున్న బీభత్సాన్ని ఖండిస్తూ ఎదుర్కోవాల్సిన అవసరం ఎంతైనావున్నది.

**5** అందుకని మేము, ఒక హైకోర్టు జడ్జిను యీ ఎన్‌కౌంటర్‌ల విషయంలో విచారణ చేయడానికి, ఈ నాయకుల మరణానికి బాధ్యులైన అందరినీ శిక్షించడానికీ నియమించవలసిందిగా డిమాండ్‌చేయమని మిమ్ములను కోరుతున్నాం.

4-7-785, ఈసామియా బజార్,
హైదరాబాదు.

**పి. వెంకటేశ్వర్లు** న్యాయవాది
కన్వీనర్, పౌరహక్కుల సంఘం

| వరుస 1 | కామ్రేడ్ పేరు 2 | వయస్సు 3 | ఊరు 4 | హత్య తేదీ 5 | రిమార్కులు 6 |
|---|---|---|---|---|---|
| 1 | పోతనపల్లి అప్పారావు | 20 | బొడ్డపాడు. శ్రీకాకుళం జిల్లా | 30-8-71 | ఎన్‌కౌంటర్‌లో కాక నిద్రిస్తున్నప్పుడు చంపబడ్డాడు |
| 2 | వెంపటాపు సత్యనారాయణ | 40 | బూర్జువలస, శ్రీకాకుళం జిల్లా | 10-7-70 | |
| 3 | ఆదిభట్ల కైలాసం | 40 | కార్యవలస, శ్రీకాకుళం జిల్లా | 10-7-70 | |
| 4 | పట్టిక చిన్నలు | 30 | నీలకంఠాపురం, శ్రీకాకుళం జిల్లా | 11-12-69 | |
| 5 | పయిల భీముడు | 30 | మొండెంకల్లు, శ్రీకాకుళం జిల్లా | 26-5-69 | |
| 6 | కురంగి మల్లయ్య | 35 | గాడిదపైన్, శ్రీకాకుళం జిల్లా | 11-1-70 | |

| 1 | 2 | 2 | 4 | 5 | 6 |
|---|---|---|---|---|---|
| 7 | సవర జమ్మడు | 45 | బొడ్డనబుడుగు, శ్రీకాకుళం జిల్లా | | |
| 8 | రావూరి శ్యామ్ | 26 | విజయవాడ, క్రిష్ణా జిల్లా | | |
| 9 | దున్న గోపాల్ రావు | 18 | బొడ్డపాడు, శ్రీకాకుళం జిల్లా | 27-5-69 | |
| 10 | మేడవరపు వెంకటరమణమూర్తి | 35 | బొదవలస, శ్రీకాకుళం జిల్లా | 13-6-70 | |
| 11 | వావిలపల్లి సత్యనారాయణ | 38 | పుత్తరవల్లి, శ్రీకాకుళం జిల్లా | | |
| 12 | డా॥ దేవినేని మల్లికార్జునుడు | 28 | నన్నంపుడి, నెల్లూరు జిల్లా | 30-7-70 | |
| 13 | రెడ్డి అప్పలస్వామి | 35 | నారాయణపురం, శ్రీకాకుళం జిల్లా | 17-3-69 | |
| 14 | రెడ్డి చిన్నంనాయుడు | 32 | కొమరాడ, శ్రీకాకుళం జిల్లా | | |
| 15 | సుబ్బారావు పాణిగ్రాహి | 35 | బొడ్డపాడు, శ్రీకాకుళం జిల్లా | 22-12-69 | |
| 16 | తామాడ గణపతి | 35 | బొడ్డపాడు, శ్రీకాకుళం జిల్లా | 22-12-69 | |
| 17 | జుట్టు ఉమాపతి | 25 | చిన్నసీలవటి, శ్రీకాకుళం జిల్లా | 14-6-70 | |
| 18 | ఉరియం మల్లేశ్వరరావు | 22 | పెడనీ | 30-7-70 | |
| 19 | గోరంట్ల కోటేశ్వరరావు | | రాజోలు, గుంటూరు జిల్లా | | |
| 20 | మదనాల దుష్యంత్ | 26 | బొడ్డపాడు, శ్రీకాకుళం జిల్లా | | |
| 21 | పంచాది కృష్ణమూర్తి | 35 | బొడ్డపాడు, శ్రీకాకుళం జిల్లా | 27-5-69 | |
| 22 | పంచాది నిర్మల | 22 | బొడ్డపాడు, శ్రీకాకుళం జిల్లా | 22-12-69 | |
| 23 | వీరంకి రాజగోపాల్ రావు | 30 | ఏలూరు, ప॥ గోదావరి జిల్లా | 26-6-70 | |
| 24 | టిక్కా రాములు | | వినుకొండ, గుంటూరు జిల్లా | 11-9-70 | |
| 25 | చెల్లూరి ఉమాపతి | 19 | రాజం, శ్రీకాకుళం జిల్లా | 22-12-69 | |
| 26 | డా॥ బాగంటి భాస్కరరావు | 34 | బాగంటిపాడు, గుంటూరు జిల్లా | 22-11-69 | |

| | | | | |
|---|---|---|---|---|
| 27 | రమేశ్‌చంద్ర సాహు | 26 | బరంపురం, ఒరిస్సా | 22-12-69 |
| 28 | గార మాధవరావు | 26 | దున్నూరు, శ్రీకాకుళం జిల్లా | 28-11-69 |
| 29 | కురంగి సుందరి | 23 | గాడిద పైన్, శ్రీకాకుళం జిల్లా | |
| 30 | అప్పాకుల చిరంజీవులు | | అంతికొండ, శ్రీకాకుళం జిల్లా | |
| 31 | కొండగొర్రి సంగమేశు | | అంతికొండ, శ్రీకాకుళం జిల్లా | |
| 32 | గుమ్మడి లచ్చయ్య | 31 | కొమర్తి, శ్రీకాకుళం జిల్లా | |
| 33 | పుచ్చ అప్పలస్వామి | 33 | నీలావతి, శ్రీకాకుళం జిల్లా | |
| 34 | బిడ్డిక అబ్బాయి | | సాలి, శ్రీకాకుళం జిల్లా | 11-1-70 |
| 35 | మంగిరెడ్డి నారాయణరెడ్డి | 35 | | చిత్తూరు సబ్-జైలులో కాల్చేసారు |
| 36 | కొరిసిపాటి బాలిరెడ్డి | 22 | గుడులూరు, ప్రకాశం జిల్లా | 24-7-70 |
| 37 | మండలి సంగమేశు | | గొరంపేట, శ్రీకాకుళం | |
| 38 | సవర సుక్కు | 40 | అంతికొండ, శ్రీకాకుళం జిల్లా | 5-8-69 |
| 39 | పాండి జగన్నాయకులు | 31 | నారాయణపురం, శ్రీకాకుళం జిల్లా | 20-8-69 |
| 40 | జగతి భైరి | 27 | జింకుబద్ర, శ్రీకాకుళం జిల్లా | 20-8-69 |
| 41 | నిమ్మక వెంకటస్వామి | 25 | అంతికొండ, శ్రీకాకుళం జిల్లా | 5-8-69 |
| 42 | నిమ్మక సూరయ్య | 35 | అంతికొండ, శ్రీకాకుళం జిల్లా | |
| 43 | నిమ్మక నాయకన్న | 50 | అంతికొండ, శ్రీకాకుళం జిల్లా | |
| 44 | సవర సన్యాసి | | అంతికొండ, శ్రీకాకుళం జిల్లా | 5-8-69 |
| 45 | కొండగొర్రి | | కొండసిరిపి, శ్రీకాకుళం జిల్లా | 5-8-69 |

| 1 | 2 | 3 | 4 | 5 | 6 |
|---|---|---|---|---|---|
| 46 | నిమ్మక సుక్కాలు | | పురిడి, శ్రీకాకుళం జిల్లా | 24-3-69 | |
| 47 | నిమ్మక గుణాయి | | పురిడి, శ్రీకాకుళం జిల్లా | 24-8-69 | |
| 48 | బిడ్డిక జమ్మడు | | తులసి, శ్రీకాకుళం జిల్లా | 7-10-69 | |
| 49 | నథాల జోగులు | | కొండవడ, శ్రీకాకుళం జిల్లా | 9-10-69 | |
| 50 | కొండగొర్రి క్రిష్ణుడు | | కొండవడ, శ్రీకాకుళం జిల్లా | 9-10-69 | |
| 51 | మందంగి నీలకంఠం | | కొండవడ, శ్రీకాకుళం జిల్లా | | |
| 52 | అరిక తట్టడు | | ఈథమనుగుడ, శ్రీకాకుళం జిల్లా | 15-11-69 | |
| 53 | గేదాట లోకనాథం | | బొడ్డపాడు, శ్రీకాకుళం జిల్లా | 28-11-69 | |
| 54 | మురిపింటి వల్లభరావు | | మర్రిపాడు, శ్రీకాకుళం జిల్లా | 28-11-69 | |
| 55 | అరిక మంగడు | | స్వడిగూడ, శ్రీకాకుళం జిల్లా | 11-12-69 | |
| 56 | కొండగొర్రి ఎరకన్న | | బొడ్డమనుగుడ, శ్రీకాకుళం జిల్లా | 11-12-69 | |
| 57 | దున్న అంకమ్మ | 23 | రాజం, శ్రీకాకుళం జిల్లా | 22-11-69 | |
| 58 | తెలకల సరస్వతి | 25 | బొడ్డపాడు, శ్రీకాకుళం జిల్లా | 22-11-69 | |
| 59 | సల్లుమ్‌గాడు | | గాడిద పైన్, శ్రీకాకుళం జిల్లా | 6-1-70 | |
| 60 | దున్న అప్పలస్వామి | | బొడ్డపాడు, శ్రీకాకుళం జిల్లా | 30-7-70 | |
| 61 | అరిక రాంజియం | 35 | గంగన్నదొర, వలస, శ్రీకాకుళం జిల్లా | 13-2-69 | |
| 62 | కాంద్ర పురండు | | | 30-3-69 | |
| 63 | పండాల బాలక్రిష్ణ | 25 | రొట్టపాడు, శ్రీకాకుళం జిల్లా | 8-9-71 | |

| | | | | |
|---|---|---|---|---|
| 64 | దాసరి రమణ | 29 | విజయవాడ, క్రిష్ణా జిల్లా | 12-6-70 |
| 65 | పోరంకి జానకిరామరాజు | 24 | కలశేశ్వరపురం, క్రిష్ణా జిల్లా | 12-6-70 |
| 66 | బి. సి రామప్ప | 44 | చందన, అనంతపూర్ జిల్లా | |
| 67 | రాజరెడ్డి | 25 | నెల్లూరు | 9-2-73 |
| 68 | నిరంజన్‌రావు | 14 | బరంపురం, ఒరిస్సా | 27-5-69 |
| 69 | శృంగవరపు నరసింహులు | 52 | లక్కవరం, శ్రీకాకుళం జిల్లా | 27-5-69 |
| 70 | తామాడ చిన్నారావు | 15 | బొడ్డపాడు, శ్రీకాకుళం జిల్లా | 27-5-69 |
| 71 | బిడ్డిక అడ్డాయి | | చింకాలకొరిడి, శ్రీకాకుళం జిల్లా | 13-7-69 |
| 72 | పొల్లు | 29 | ఆవిరి, శ్రీకాకుళం జిల్లా | |
| 73 | కొండగొఱ్రి బంగయ్య | | కొండసిరిపి, శ్రీకాకుళం జిల్లా | 5-8-69 |
| 74 | సవర రాము | 17 | మహేంద్రగిరి, సోంపేట తా॥ శ్రీకాకుళం జిల్లా | 30-6-71 |
| 75 | రోహిదాస్ గుండంగో | | మహేంద్రగిరి, శ్రీకాకుళం జిల్లా | 30-8-71 |
| 76 | కె. నరసింహారావు | 30 | దెందులూర్, ప॥ గోదావరి జిల్లా | |
| 77 | బైనపల్లి పాపారావు | 19 | బొడ్డపాడు, శ్రీకాకుళం జిల్లా | 27-5-69 |
| 78 | ధనుంజయరావు | 18 | పెద్దసాన, శ్రీకాకుళం జిల్లా | 9-7-69 |
| 79 | జె. చిన్నారావు | 19 | మామిడిపల్లి, శ్రీకాకుళం జిల్లా | 9-7-69 |
| 80 | గొరకల సన్యాసి | 19 | సీలావతి, శ్రీకాకుళం జిల్లా | 22-11-69 |
| 81 | కంచారపు క్రిష్ణమూర్తి | 34 | మేడమర్రి, శ్రీకాకుళం జిల్లా | 27-5-69 |
| 82 | రామచంద్ర ప్రధాన్ | 32 | సల్లెల్లపుట్టుక, శ్రీకాకుళం జిల్లా | 27-5-69 |

| 1 | 2 | 3 | 4 | 5 | 6 |
|---|---|---|---|---|---|
| 83 | సూరు | | | 11-1-70 | |
| 84 | తాబేలు నాయుడు | 60 | తులసి, శ్రీకాకుళం జిల్లా | జూలై 69 | |
| 85 | అతని పుత్రుడు | 35 | .. | | |
| 86 | .. | 20 | .. | | |
| 87 | .. | 18 | .. | | |
| 88 | .. | 16 | .. | | |
| 89 | .. | 24 | .. | | |
| 90 | క్రిష్ణారెడ్డి | | 31-1-73 న శ్రీకాకుళం జిల్లాలోని కొత్తూరు పోలీస్ స్టేషన్ ఏరియాలో అరెస్టుచేసి దోన్‌బాయ్ పోలీస్ స్టేషనులోవుంచి 9-2-73 కాల్చివేసారు. | | |
| 91 | బత్తుల వెంకటేశ్వరరావు (అడ్వకేటు) | | ఖమ్మం | 1969 | |
| 92 | కొల్లిపర నర్సింహారావు | | మానుకోట (వరంగల్) | 16-5-72 | |
| 93 | దాట్ల వెంకటరామరాజు | | ములుగు (వరంగల్) | 27-7-73 | |
| 94 | అప్పలస్వామి | | శ్రీకాకుళం | 4-9-73 | |
| 95 | అరికె సోములు | | శ్రీకాకుళం | 4-9-73 | |
| 96 | జగదీశ్ (తమిళనాడు) | | ములుగులో అరెస్టుచేసి మానుకోటలో కాల్చేసారు. | | |

డిసెంబర్ నెలలో గుంటూరులో జరిగే

# ఆంధ్రప్రదేశ్ ప్రజాస్వామిక పౌర హక్కుల మహాసభను జయప్రదం చేయండి!

## విరివిగా విరాళములు యిచ్చి తోడ్పడండి

సోదరీ, సోదరులారా!

కాంగ్రెసు పరిపాలనలో నానాటికీ ప్రజల బాధలు, కష్టాలు పెరుగుచున్నవి. నిరుద్యోగం, పెరిగే ధరలు, దినవస్తువులు, అధిక పన్నులతో ప్రజాసామాన్యం క్రుంగిపోతున్నారు. ఇందుకు పరిష్కారంగా వ్యవసాయక విప్లవ కార్యక్రమం చేపట్టి భారత దేశంలో పలుప్రాంతాల్లో గిరిజనులు, గ్రామీణ రైతాంగం తమ సంఘటితశక్తితో పోరాటాలు సాగిస్తున్నారు. ఇవి నక్సల్‌బరీలో ప్రారంభమై శ్రీకాకుళం, వరంగల్, ఖమ్మం, కరీంనగర్, తూర్పుగోదావరి జిల్లాలకు వ్యాప్తిచెందినవి. భూసంస్కరణలు తాముగూడ అమలు జరుపుతామంటున్న కాంగ్రెసుపాలకులే యీ న్యాయమైన రైతాంగ పోరాటాలను సైన్యాన్నిదింపి రక్తపుటేరుల్లో ముంచారు. భూమి, భుక్తి, విముక్తికై సాగుచున్న ప్రజాపోరాటాల్లో పాల్గొన్న మార్క్సిస్టు- లెనినిస్టుపార్టీ, విప్లవ కమ్యూనిస్టుపార్టీ కార్యకర్తలను అరెస్టులుచేసి, నానా చిత్రహింసలకు గురిచేసి, కాల్చి చంపుతున్నారు. కామ్రేడ్స్ పంచాది కృష్ణమూర్తి, నిర్మల, వెంపటాపు సత్యనారాయణ, ఆదిభట్ల కైలాసం, బత్తుల వెంకటేశ్వర్రావు, సుబ్బారావు పాణిగ్రాహి, బిక్కి రాములు, చాగంటి భాస్కరావు, దేవినేని మల్లిఖార్జునుడు, రాజా రామిరెడ్డి, అరికె సోములు, దాట్ల వెంకటరామరాజు మొదలగు సుమారు 150 మందిని యీ కసాయి కాంగ్రెసు ప్రభుత్వం తుపాకి గుండ్లకు బలిచేసింది గిరిజన ప్రాంతాల్లో సి. ఆర్. పి. ని దింపి గ్రామాలను చుట్టుముట్టి మూకుమ్మడిదాడులు జరిపి ప్రజల ఆస్తులను దోచుకొని పంటలను ధ్వంసంచేస్తున్నారు. స్త్రీ పురుష విచక్షణలేకుండా చిత్రహింసలుపెట్టి బనాయింపు కేసుల్లో యిరికించి జైళ్ళలో కుక్కుతున్నారు.

న్యాయమైన తమ హక్కులకై ఉపాధ్యాయులు మొదలు యన్.జి.ఓ.లు, డాక్టర్లు ఇంజినీర్లు, రైల్వే ఉద్యోగులు, యు. పి. పోలీసులతోసహా ప్రభుత్వ వ్యతిరేక అసమ్మతి ప్రదర్శనలుచేసి దీర్ఘకాల సమ్మెపోరాటాలు సాగించారు. న్యాయమైన యీ సమ్మెలను నిషేధించి అరెస్టులుచేసి, ఉద్యోగాలనుంచి తొలగించి భయంకర పరిస్థితులు

కల్గించారు. ప్రత్యేకాంధ్ర ఉద్యమాన్ని అణచుటకు సైన్యాన్నిదింపి ఆంధ్రప్రదేశ్‌ను యుద్ధభూమిగామార్చారు. విజయవాడ, గుంటూరు, నెల్లూరు, మొదలగు పట్టణాల్లో సైనికులు యిండ్లలో దౌర్జన్యంగా జొరబడి లూటీచేసి స్త్రీలతో అసభ్యంగా ప్రవర్తించారు. యీ సందర్భంగా అరెస్టులుచేసిన అనేకమంది విద్యార్థులను యువకులను యిప్పటికీ కోర్టులచుట్టూ త్రిప్పుచూ కాలయాపన చేయుచున్నారు. ఇటీవల విప్లవ రచయితలైన వరవరరావు. యం.టి. ఖాన్, చెరబండరాజులను అరెస్టులుచేసి ప్రాథమిక హక్కులలో పొందుపరచబడిన కనీస పౌర హక్కులైన భావ, వాక్, పత్రికా స్వాతంత్ర్యములనుకూడ హరించివేయుచున్న దీ ప్రభుత్వం.

కేరళలో అచ్యుతమీనన్ నాయకత్వానగల ప్రభుత్వం సమ్మెలను, ప్రజా పోరాటాలను నిర్బంధంతో అణచివేసి, విప్లవకారులను కారాగారాల్లో కుక్కి కామ్రేడ్ వర్గీసును కనుగుడ్లుపీకి కాల్చివేశారు. బీహారులోని పూర్ణియాజిల్లా రుపాస్‌పూర్ చాన్ద్వాలో 14 సంతాల్ కౌలుదార్లను (స్త్రీలు పిల్లలతోసహా) కొందర్ని కాల్చివేసి, మరి కొందర్ని సజీవదహనం జేశారు. షహబాద్‌లో యిద్దరు సోషలిస్టులను, వెలిబేలిలో 7 గురు కమ్యూనిస్టులను (మితవాద), చారీలో 4 గురు హరిజన కూలీలను, సురేంద్రనారాయణసింగ్‌తోసహా కాల్చి హత్యజేశారు. బెంగాల్‌లో జరిగిన చిత్రహింసలు, విషాదకర హత్యాకాండతో కలకత్తా నడివీధుల్లో రక్తం వరదలై ప్రవహించింది అనారోగ్యంతోనున్న కామ్రేడ్ చారుమజుందార్ పోలీసు కార్యాలయంలో హింసకు గురై హత్యగావించబడ్డాడు. పంజాబ్ విద్యార్థులెందరో దారుణ నిర్బంధానికి, హత్యలకు గురైనారు.

భారతదేశంలోని జైళ్లను 32000 విప్లవకారులు, యితర రాజకీయ ఖయిదీలతో నింపారు. కుట్రకేసులు, క్రిమినల్ కేసులు బనాయించి విచారణ తంతుపేరుతో సంవత్సరాలు జరిపి, అనంతరం దీర్ఘకాల కఠినశిక్షలు విధిస్తున్నారు. అన్నిటికీమించిన విచిత్రమేమంటే వేలాది రాజకీయపార్టీల కార్యకర్తలను, రాజకీయ ఖయిదీలుగా పరిగణించక జైళ్లలో క్రిమినల్సుగా పగలు రాత్రిళ్లు చేతులకు బేడీలువేసి చీకటిగదుల్లో హింసిస్తున్నారు. చివరకు నాగభూషణం పట్నాయక్, భూమయ్య, కృష్ణగౌడ్‌లను ఉరిశిక్షలకు గురిచేసిం దీ కాంగ్రెసు ఫాసిస్టు ప్రభుత్వం.

నిత్యపరిపాలనలో 144 సెక్షన్లు, కర్ఫ్యూలు, పోలీసు క్యాంపులు, కల్లోలిత ప్రాంతాలుగా ప్రకటించుట సర్వసాధారణమైనది. సివిల్ పాలన స్థానంలో పోలీసు, మిలిటరీ జోక్యం నానాటికి పెరుగుతున్నది. ప్రభుత్వంలో నియంతృత్వ ధోరణులు తలెత్తి పరిపాలిస్తున్నవి. విప్లవకారులు ప్రథమశ్రేణిలో నిల్చి యిందుకు తమవంతు

మూల్యం చెల్లిస్తున్నారు. భారత ప్రజలు, వివిధపార్టీలు యేదోరీతిగా యీ నిర్బంధ పాలనా యంత్రానికి గురగుచున్నారు. ఇదొక నూతన ప్రత్యేక పరిస్థితి.

అందుచే వివిధ జిల్లాల ముఖ్యులు 14—10—73 న గుంటూరులో సమావేశమై పై పరిస్థితులను పరిశీలించి రాష్ట్ర పౌరహక్కుల మహాసభను డిసెంబరులో గుంటూరులో జరుప నిర్ణయించారు. పై తేదీన గుంటూరుజిల్లా ముఖ్యుల విస్తృత సమావేశంలో ఆహ్వానసంఘం యెన్నికైనది. యీ మహాసభకు శ్రీశ్రీ, కుచేలన్, ప్రమోదసేన్‌గుప్తా, జయశ్రీ రాణా, నవకృష్ణచౌదరి, కర్పూరీఠాకూర్, మోహనరామ్, ఆర్.కె. గార్గ్, మునిగుహ, సమ్మర్ సేన్, జార్జిఫెర్నాండిజ్, మృణాలసేన్, ఉత్పలదత్, మైత్రీదేవీ, రహబార్, భక్తిభూషణ్, పండిట్ సుందర్‌లాల్, సముద్దర్ మొదలగువారిని ఆహ్వానించడమైనది. అంతేగాక యీ దశలో మన రాష్ట్రంలో మరణించిన మృతవీరుల సంగ్రహ జీవితచరిత్రను పుస్తకరూపంలో ప్రకటించుటకుగూడ నిర్ణయమైనది. కాన యీ మహాసభను, పై కార్యక్రమాన్ని జయప్రదంచేయుటకు ప్రజలు విరివిగా విరాళాలిచ్చి, సభలో స్వయంగా పాల్గొని అన్నివిధాలా సహకరించాలని విజ్ఞప్తి చేస్తున్నాము.

ఇట్లు,
ఆహ్వాన సంఘం

---

## అమర వీరుల జీవిత చరిత్ర

శ్రీకాకుళ రైతాంగ సాయుధ పోరాటంలో 1967 నుండి నేటిదాక ఫాసిస్టు ప్రభుత్వ పాశవిక చర్యలకు పాల్పడి అమరులైన మృతవీరుల చరిత్ర విప్లవ రచయితల సంఘం ప్రచురిస్తున్నది. ఈ మహత్తరమైన స్మరణను సమగ్రం చేసుకోవడానికి దేశం నాలుగుచెరుగుల వున్న విప్లవాభిమానులందరు తమవద్ద వున్న సమాచారం, ఫోటోలు, బ్లాకులు వెంటనే పంపించి సహకరిస్తారని ఆశిస్తున్నం. పుస్తకం సృజన సైజులో వుంటుంది. అమరవీరుల ఫోటోలు అందినన్ని ప్రచురిస్తాం. మీ నిర్మాణాత్మకమైన సూచనలు, ఆర్థిక సహకారం కూడ సత్వరంగా అందించండి. డిసెంబర్ 23 న గుంటూరులో జరిగే రాష్ట్ర పౌర హక్కుల సభనాటికి పుస్తకం వెలువడుతుంది.

మీ సమాచారం, ఫోటోలు, బ్లాకులు, డబ్బు, సూచనలు యీ కింది అడ్రసుకు డిసెంబర్ 10వ తేదీలోగా పంపించండి.

**సృజన, హనుమకొండ, వరంగల్ - 506001 (ఆంధ్ర ప్రదేశ్)**

# రాష్ట్ర పౌరహక్కుల మహాసభ
# డిసెంబర్ 23వ తేది జరపాలని నిర్ణయం

ఆంధ్ర ప్రదేశ్ ప్రజాస్వామిక పౌరహక్కుల మహాసభను 1973 డిసెంబరు 23వ తేదీ (ఆదివారము) జరపాలని ది. 11-11-73 న గుంటూరులో శ్రీ పి. శ్రీమన్నారాయణ అధ్యక్షతన సమావేశమైన ఆహ్వాన సంఘం నిర్ణయించడమైనది.

ఆ తేది నాటికి ఒక సావనీర్‌ను (అమరవీరుల జీవిత గాధలు, ఫొటోలు, ప్రజాపోరాటాలు, ప్రభుత్వ నిర్బంధ కాండను గూర్చిన సమాచారంతో) ప్రచురించాలని నిర్ణయించ బడింది. సావనీర్‌కు శ్రీయుతులు గణేశుని కోటేశ్వరరావు, మాదాల నారాయణస్వామి, కొల్లిపర వెంకటేశ్వరరావు, చెరుకూరి సత్యనారాయణ గార్లతో సంపాదక వర్గం నియమించబడింది.

కనుక వెంటనే సావనీర్ కోసం ప్రకటించిన సమాచారాన్ని పంపాలని విరాళాల సేకరణ కార్యక్రమంకూడా వెంటనే ప్రారంభించాలని కోరుచున్నాము.

అభివందనములతో

గుంటూరు,
ది. 12-11-1973

ఆహ్వాన సంఘము

వివరాలకు :

కె. వెంకటేశ్వరరావు,
5-38-46, మేడపైన,
5వ లైను, బ్రాడీపేట,
గుంటూరు-522002

ప్రియమైన కామ్రేడ్స్,

కావలసిన సమాచారం. 1967 నుండి:

జిల్లా:

1. జైళ్లలో కాకుండా కాల్చివేయబడినవారి పేరు, ఫోటో.
ఎ. వయస్సు బి. గ్రామం సి. ఎక్కడ చనిపోయినది డి. చనిపోయిన తేదీ
2. జైళ్లలో కాల్చివేయబడినవారి పేరు:
ఎ. వయస్సు బి. గ్రామం సి. ఎక్కడ చనిపోయినది డి. చనిపోయిన తేదీ
3. జైళ్లలో మందులు సప్లయి సరిగా లేక చనిపోయినవారి పేరు:
ఎ. వయస్సు బి. గ్రామం సి. ఎక్కడ చనిపోయినది డి. చనిపోయిన తేదీ
4. జిల్లాలో మొత్తం విప్లవకారులపై పెట్టబడిన మొత్తం కేసుల సంఖ్య.
5. ఆ కేసులో ముద్దాయిల సంఖ్య
6. ఒక్కొక్క కేసు నంబరు. బి. పోలీసు స్టేషన్, సి. ముద్దాయిల సంఖ్య. డి. కేసు పెట్టబడిన తేది, ఇ. కేసు విచారణ చేయబడినదా? లేక ఎంతకాలంగా కోర్టులో నడుచుచున్నది. ఎఫ్. కేసు విచారణ జరిగిన సందర్భంలో శిక్షపడిన కాలము
7. విప్లవకారులను అరెస్టు చేసిన తరువాత కోర్టుకు హాజరు పరచకుండా ఎంతకాలము పోలీసు కస్టడీలో వుంచినది. ఏ చిత్రహింసలకు గురిచేసినది.
ఎ. పేరు బి. ఎక్కడ పట్టుకున్నది. సి. ఎక్కడ పట్టుకున్నట్లు ప్రభుత్వము ప్రకటించినది. డి. ఏ తేదీన అరెస్టు చేసినది. ఇ. ఏ తేదీన కోర్టుకు హాజరు పరచినది.
8. కర్ఫ్యూలు, 144 సెక్షన్ అమలు జరుపబడిన సమయాలు, సంఖ్య.
9. MISA, T.S.A., PD., Emergency Regulation చట్టం క్రింద రాజకీయ సంబంధంగా అరెస్టు చేయబడినవారి పేర్లు, వారి నిర్బంధకాలము.
10. పుస్తకాలు, రచనలు, సభలు, సమావేశాలపై నిషేధాలు, నిర్బంధాలు.
11. వివిధ రకాల ప్రజా ఉద్యమాల సందర్భంగా పెట్టబడిన కేసులు, జైళ్లలో నిర్బంధించిన కాలము.

ఇతరములు.. ........................(పోలీసు క్యాంపులు వగైరా)

విజ్ఞప్తి:— పై సమాచారమును వెంటనే సేకరించి ఆఫీసు అడ్రసుకు పంపవలసినదిగా కోరుతున్నాం. మరియు వసూలయిన విరాళములను డిసెంబరు మొదటి వారానికి మాకు చేరునట్లుగా పంపవలసిందిగా విజ్ఞప్తి చేయుచున్నాము.

మహాసభకు హాజరగు ప్రతినిధులు 22వ తేదీ రాత్రికే గుంటూరు చేరునట్లు ఏర్పాటు చేయవలెను.

అభివందనములతో

SRJANA Telugu Monthly Dec. '73 H-1088
Regd. No. with Registrar of News Papers 10953/67



1 Re.

SRJANA
Hanamkonda
Warangal 506001